ప్రియతమ ముఖ్యమంత్రి

శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారి

స్వర్ణజయంతి కానుక

# ముఖ్యసేవకుడు-2



రచన

## పసుపులేటి వెంకట రమణ

పుస్తకము : ముఖ్య సేవకుడు-2

రచన : పసుపులేటి వెంకట రమణ

పబ్లిషర్స్ : శ్రీమతి పి. పద్మావతి
పి.యమ్.కె.యమ్. పబ్లికేషన్స్
19-7-22, టి.బి.రోడ్,
బండ్లమిట్ట, ఒంగోలు-523 001.
ఫోన్: (08592) 20743

## సమన్వయకర్తలు

మారెళ్ళ వివేకానంద

షేక్ మహమ్మద్ పఠాన్ ఖాన్

గూడ వెంకటేశ్వర్లు

అబ్బూరి ఆదిశేషయ్య

శింగరాజు రాంబాబు

షేక్ అబ్దుల్ కుద్దూస్

హాలివుడ్ వెంకటేశ్వర్లు

ముఖ చిత్రం : వై. వెంకటరత్నం

ముద్రణ : శ్రీ పవన్ ఆఫ్‌సెట్



వెల : 99/-

ACC NO. 20622

# అంకితము



**"పుట్‌పాత్ మీద అనాధపిల్లల్ని చూసి వాళ్ళను ఉచితంగా పోషిస్తూ చదువు చెప్పి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలి".**

ఇది మన నల్లూరి మనస్సులో ఆలోచన. చెడు ఆలోచన మనలో కల్గితే అది మన పతనానికి కారణం - మంచి ఆలోచన కల్గితే ఉత్తమ మనిషి లక్షణం.

అక్షరజ్యోతి వెలిగించే మేధావుల్ని తయారు చేస్తూ స్వశక్తితో ఎదిగిన నిరంతర శ్రమజీవి **"మహర్షి"** అవార్డు గ్రహీత **"శ్రీ ప్రతిభ కాలేజి"** నిర్మాత **"నల్లూరి వెంకటేశ్వర్లు"** గారికి **"ముఖ్య సేవకుడు -2"** పుస్తకము అంకితం చేస్తున్నాము.

రచయిత

పసుపులేటి వెంకటరమణ

# కృతజ్ఞతలు

1. గౌ॥ శ్రీ జి.యం.సి. బాలయోగి గారు

   లోక్ సభస్పీకర్

2. గౌ॥ శ్రీ యు. కృష్ణంరాజు గారు

   సినీనటులు & పార్లమెంట్ సభ్యులు

3. గౌ॥ డా॥ శ్రీ ఏల్చూరి వెంకట్రావు గారు

   రచయిత

4. గౌ॥ శ్రీ కె. ప్రసాద్ బాబు గారు

   సినీనటులు & సెన్సార్ బోర్డు సభ్యులు

5. గౌ॥ శ్రీ శివకృష్ణ గారు

   సినీ నటులు బి.జె.పి. సభ్యులు

6. గౌ॥ శ్రీ పి.ఆర్.కె. శర్మ గారు

   రవీంద్రభారతి కార్యదర్శి

కృతజ్ఞతలతో

మీ

పసుపులేటి వెంకటరమణ

పి.యం.కె.యమ్. పబ్లికేషన్స్

## స్వర్ణజయంతి
## 20-4-2000 జన్మదినోత్సవ శుభాకాంక్షలు



ఏదేశమేగినా ఎందుకాలిడినా

ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనినా

పొగడరా నీతల్లి భూమి భారతిని

నిలుపరా నీజాతి నిండు గౌరవాన్ని

ఏపూర్వపుణ్యమో, ఏ యోగబలమో

జనియించినావు స్వర్ణాంధ్రమున

ఏమంచి పూవులన్ ప్రేమించినావో

నిను మోసె ఈ తల్లి కనక గర్భమున

జై జన్మభూమి - జై జై చంద్రబాబు

మీ

**పసుపులేటి వెంకటరమణ**

పి.ఎమ్.కె.ఎమ్. పబ్లికేషన్స్, ఒంగోలు

ముఖ్యమంత్రి **శ్రీ నారా చంద్రబాబు నాయుడు** గారి
రాజకీయ జీవిత చరిత్ర "ముఖ్యసేవకుడు-1" పుస్తకావిష్కరణ సందర్భము



గ్రంధ ఆవిష్కర్త **శ్రీ జి.యం.సి. బాలయోగి గారు**
లోక్ సభస్పీకరు

**శ్రీ యు. కృష్ణంరాజు గారు** పార్లమెంట్ సభ్యులు

**శ్రీ కె. ప్రసాద్ బాబు** సినీ నటులు

**శ్రీ డా॥ ఎ. వెంకట్రావు గారు**

**శ్రీ శివకృష్ణ గారు** సినీ నటులు మరియు

**శ్రీ పసుపులేటి వెంకట రమణ** రచయిత గారితో

పి.యం.కె.యం. కార్యక్రమము



సమర్ధవంతమైన పరిపాలనకు బీజం వేసి వివిధ ప్రజా సంక్షేమ పధకాలను చేపట్టి తెలుగుగడ్డపై క్రొత్త చరిత్రకు శ్రీకారం చుట్టిన నిత్యకృషీవలుడు శ్రీ చంద్రబాబు నాయుడు. పట్టుదల, అంకితభావంతో కష్టపడితే సాధ్యంకానిదే లేదని నిరూపించిన ముఖ్యమంత్రి.

ప్రజాప్రతినిధులు ప్రజాసేవకులుగా వుండాలని, దేశాభివృద్ధి, సమగ్రత, విశిష్టత, కాపాడాల్సిన, బాధ్యత ప్రజాప్రతినిధుల పైనే ఎక్కువుగావుంది. పేద, బలహీన వర్గాల కోసం ఎన్నో పధకాలను ప్రవేశపెట్టి రాష్ట్రాన్ని స్వర్ణాంధ్రప్రదేశ్‌గా తీర్చిదిద్దిన ముఖ్యమంత్రి కృషి ప్రశంసనీయం. నైతిక విలువలు గురించి ఇప్పుడు చర్చ బాగా జరుగుతుంది. రాత్రింబవళ్ళు కృషి చేసే ముఖ్యమంత్రి గారి మీద రచయిత పసుపులేటి వెంకటరమణ **"ముఖ్యసేవకుడు"** గ్రంధాన్ని రచించటం ఎంతో ముదావహం-ప్రశంసనీయం.

మీ

**జి.యం.సి. బాలయోగి**

లోక్‌సభ స్పీకరు



ఎందరో ముఖ్యమంత్రులు చేపట్టిన పథకాలు మీడియాకే పరిమితమైయ్యాయి. కాని చంద్రబాబు నాయుడు గారు టెలీకాన్ఫరెన్స్‌ల ద్వారా ప్రజాసమస్యలను తెలుసుకుని ప్రజా సంక్షేమ పథకాలను చేపడుతున్నారు. పనే దైవంగా, ప్రజలే దేవుళ్ళుగా అహర్నిశలు కృషి చేస్తున్న ముఖ్యమంత్రి గారి మీద **"ముఖ్య సేవకుడు"** పుస్తకం రచించిన పసుపులేటి వెంకటరమణ కృషిని అభినందిస్తున్నాను.

మీ

**డా॥ ఏల్చూరి వెంకట్రావు**

రచయిత



పని సాధనకు ముందుగా వివిధ విషయాలను ఆలోచించి ప్రాధమికమైన కొన్ని అంచనాలను, పనుల్ని నిర్ధిష్టంగా ఏర్పరచుకొనే విషయంలో ముఖ్యమంత్రి ఆదర్శప్రాయుడు.

ఏకాగ్రత, అంకితభావం, క్రమశిక్షణ, కర్తవ్యదీక్ష, మొదలైన లక్షణాలుగల వ్యక్తి శ్రీ చంద్రబాబునాయుడు. ఇలాంటి వ్యక్తుల అవసరం ఎంతైనా వుంది అని రచయిత పసుపులేటి వెంకటరమణ ముఖ్యమంత్రిగారి అభివృద్ధి కార్య ... సత్యస్ఫూర్తితో "ముఖ్య సేవకుడు" గా రూపొందించట ... వందనీయం.

...ంరాజు

సి ... మెంటు సభ్యులు



ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికోసం అహర్నిశలు శ్రమించే ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు అలాంటి ముఖ్యమంత్రిని "ముఖ్యసేవకుడు" గా అభివర్ణించి రాసిన ఈ పుస్తక రచయిత పసుపులేటి వెంకట రమణ అభినందనీయుడు -

ఈ "ముఖ్య సేవకుడు" పుస్తకం ప్రజాబాహుళ్యంలోకి తీసుకెళ్లి కార్యకర్తలకు ప్రేరణ కల్గించాల్సిన అవసరం నాయకులకు ఎంతో వుంది.

మీ

**కె. ప్రసాద్ బాబు**

సినీ ఆర్టిస్టు & సెన్సార్ బోర్డు సభ్యులు



మంచిపని చేసినప్పుడు పార్టీలు, కులమతాల కతీతంగా ప్రజలు స్పందించాల్సిన అవసరంవుంది. మంచి పనులతో ప్రజలని స్పందింప చేసిన ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడుగారి మీద "ముఖ్యసేవకుడు" పుస్తకం రచించిన పసుపులేటి వెంకటరమణ అభినందనీయుడు

మీ

**శివకృష్ణ**

సినీ ఆర్టిస్టు & బి.జె.పి. సభ్యులు



మానవత్వం పరిమళించే మంచి మనిషి

ప్రకాశం జిల్లా ప్రథమ మహిళా మంత్రిణి

రాష్ట్ర వాణిజ్య శాఖామాత్యులు

**శ్రీమతి జాగర్లమూడి లక్ష్మీ పద్మావతి**

గారికి అభినందనలు

మీ

పసుపులేటి వెంకట రమణ

రచయిత

# అభినందనలు



50 ఏళ్ల చరిత్రలో ఒంగోలు నాయకులు చేయలేని

బండ్లమిట్ట వాసుల పట్టాల సమస్యని

చేధించి సాధించిన పార్లమెంటు సభ్యులు

చౌడుభూమిలో సువర్ణాన్ని పండించగల గుండెల్లో దమ్మున్న

**"కరణం బలరామ కృష్ణమూర్తి"** గార్కి

హృదయాభినందనలు

మీ

**పసుపులేటి వెంకట రమణ**

రచయిత

# అభినందనలు



విషయం తెల్సిన మనిషి

అహర్నిశలు శ్రమించే మనిషి

ప్రకాశం జిల్లా తెలుగుదేశం పార్టీ

అధ్యక్షులు & శాసన సభ్యులు

**శ్రీపాలపర్తి డేవిడ్ రాజు** గారికి అభినందనలు

మీ

**పసుపులేటి వెంకట రమణ**

రచయిత

# పొలపల మల్లిఖార్జున్‌కు
# నీరాజనాలు






ఏ చుక్క తుళ్ళులో చూసినా

ఏ రెమ్మ పువ్వులో చూసినా

మా మల్లిఖార్జున్ బింబమే

గలగలపారేటి మూసి ఏటి నీటిలోన

నెత్తురుని పీల్చిన మద్రాసు నగరిలోన

మట్టిలో కలిసిన ఒంగోలు నేలతల్లి

కన్నీటి గాయాన్ని మరపించినాము

పి.యం.కె.యం. సంస్థను స్థాపించినాము

సింధూర వర్ణంబు చిలికించు భాస్కరా

ఉదయరాగాల జయంబు నీయరా




మీ

**పసుపులేటి పద్మావతి వెంకటరమణ**

# అక్షరాంజలి

నాలో అణువణువు

ఆ పుణ్యమూర్తుల శ్రమఫలం

నాజీవితంలో ప్రతి క్షణం

ఆ మాతృమూర్తుల దివ్యాశీస్సులే

కీ.శే. పుల్లంశెట్టి లక్ష్మమ్మ

కీ.శే. కొంగాల కోటమ్మ గార్లకు

అక్షరాంజలి ఘటిస్తూ.............

మీ

పసుపులేటి వెంకటరమణ

# ముఖ్యసేవకుడు

పల్లవి!! నేలతల్లి ఋణం తీర్చే బాల చంద్రుడు
పల్నాటి చరిత్రలో మహావీరుడు
జన్మభూమి ఋణం తీర్చే నారాచంద్రుడు
తెలుగుగడ్డ గర్వించే చంద్ర నాయుడు

చ- 1 జన్మభూమి పిలుస్తోంది కలసి సాగుదాం
పల్లెపల్లె స్వర్గసీమ చేసి తీరుదాం
ఊరు వాడ కదిలింది జన్మభూమికి
యువత పరుగు తీస్తోంది పలుగుపారకి
మొక్క ఒకటి నాటి చూడు జన్మభూమికి
మహావృక్షమై నిలుస్తోంది ముందు జాతికి
మానవహారం పిలుస్తోంది ప్రగతి బాటకి
ఒకే కొమ్మ పువ్వులమై బ్రతకటానికి

పల్లవి. .................. ...........

చ- 2 శ్రమదానం పిలుస్తోంది పరిశుభ్రత పంచడానికి
పరిసరాలు బాగుచేసి ఆరోగ్యం పెంచడానికి
కర్షక సదస్సు కదిలింది బంజరు సాగుచేస్తానికి
డ్వాక్రా పిలుస్తోంది బ్రతుకుబాట చూపటానికి
అక్షరజ్యోతి వెలిగింది నిరక్షరాస్యత తీర్చటానికి
పాడి, పట్టు, కుటీర పరిశ్రమలు అభివృద్ధి చేయటానికి

పల్లవి ........ ........

చ- 3 ఆంధ్రకేసరి, అల్లూరి, సర్వేపల్లి అమరజీవి
త్యాగమూర్తులై నిలిచిన భూమి
సూర్యకుమారి, స్వరాజ్యలక్ష్మి, దుర్గాభాయి,
రుద్రమ్మలు
మణిదీపమై వెలసిన భూమి
హృదయముంటే చేయి కలుపు జన్మభూమికి
మనిషివైతే మేలుకొలుపుదేశ ప్రగతికి
అమ్మ ప్రేమ గుర్తురాదా ఈనాడైనా
జన్మభూమి నీదేరా ఏనాడైనా.

# ఆత్మ పరిశీలన



మనం ఒక్కసారి ఆత్మ పరిశీలన చేసుకుందాం! ఇలాంటి ముఖ్యమంత్రి కావాలి అని అందరికీ వుంది. స్థానిక లీడర్స్‌కి ఇంట్లో గెలవాలనే ఆలోచన లేదు. ఉన్నా అది రౌడీ బలంతో గెలవాలనుకుంటున్నారే కానీ ప్రజా హృదయాలలో స్థానం సంపాయించుకోవాలనే ఆలోచన లేదు. ప్రజలకు వున్న అభిమానాన్ని స్థానిక నాయకులు ఎంతవరకు నిలబెట్టుకుంటున్నారు!

కార్యకర్తలుగా నాయకులు అభిమానుల్ని పెంచుకోవాలి. ఒక ప్రక్క సమర్ధవంతమైన కార్యకర్తలు ప్రశంసనీయంగా కృషిచేస్తూ వుంటే మరొక ప్రక్క కొంతమంది పెద్దలు గిల్లి కజ్జాలు పెట్టుకొని కీచలాడుకుంటున్నారు. నాయకులు రాజకీయ ప్రత్యర్ధిని శత్రువుగా భావిస్తూ ఏవిధంగానైన సరే అధికారం సంపాయించాలనే ఆరాటంలో తమ గమ్యాన్ని కోల్పోతున్నారు.

తెలుగుదేశం అంటే శక్తివంతమైన పార్టీ. ఆంధ్రదేశాన్ని ప్రగతిబాట నడిపించగల పార్టీ. తెలుగుదేశం మీద మీ అభిప్రాయం ఏమిటని ప్రజల్ని సూటిగా అడిగారా! టి.డి.పి. విజయం సాధిస్థానికి కార్యకర్తలందరూ శక్తి వంచనలేకుండా పని చేస్తున్నారేమో ఆత్మపరిశీలన చేసుకోండి. సవరించుకోలేని తప్పిదాలు మనం చేయకూడదు. అలాంటి పొరపాట్లు జరక్కుండా జాగ్రత్తపడండి.

మీరు ప్రజల్లోకి పోయేందుకు ఎలాంటి ఇబ్బందులు మీకు వున్నాయో వాటిని పరిశీలించుకోండి. సృజనాత్మకంగా ఆలోచించగల కార్యకర్తల్ని తయారుచేయండి. ప్రతి టి.డి.పి. కార్యకర్త నేను ఎంతవరకు ఈ పార్టీకి న్యాయం చేస్తున్నాను. ఈ పార్టీకి ఎలా సహాయ పడుతున్నాను, అని గుండె మీద చెయ్యి వేసుకొని ఆలోచించండి.

పార్టీలో ముఠాతత్వానికి, అంతర్గత పోరాటాలకు, అంతులేని కలతలకు తావులేదు. మన పార్టీలో కూడా తప్పుడు అభిప్రాయాలు గల వ్యక్తులు లేక పోలేదు. వాళ్ళ వల్లనే గ్రూపు

కలహాలు ఆరంభమౌతున్నాయి. మన లోపాలను మనం ధైర్యంగా చెప్పుకోవాలి. మనకు ఎదురయ్యే అవాంతరాలని నేరుగా ఎదుర్కోవాలి. తెలుగు దేశం విజయం సాధించింది అంటే విధానాలు ప్రజలకు నచ్చినట్లే. ఆ విధానాల విజయాల వల్లనే ప్రజల దృష్టిలో గౌరవం వుంది. మన ఆశయాలను మన ప్రజలకు ధైర్యంగా విడమర్చి చెప్పాలి.

తెలుగుదేశం అంటే పేదల కోసం, దళితుల కోసం, వెనుకబడిన వారి కోసం, రైతుల కోసం, కార్మికుల కోసం, అన్యాయానికి గురయ్యే ప్రతి ఒక్కరి కోసం ఆవిర్భవించినది. తెలుగుదేశం అనేది ప్రజలు ఆశించే రీతిలో వుండాలి. అన్ని తరగతుల వ్యక్తులతో సంబంధాలు మంచిగా వుండాలి. మనం ఎంత ముఖ్యమైన విషయాలనైనా పట్టుదల కనబరుస్తూ ఏ ఒక్కరూ మనల్ని ఆక్షేపించని రీతిలో నడచుకోవాలి. ప్రజాభిప్రాయాన్ని మేల్కొల్పుతూ ప్రజల్ని కర్తవ్యోన్ముఖుల్ని చేస్తూ ఈ కృషి యావత్ పేద ప్రజల కోసమే అనేలా మనం తయారు కావాలి. ప్రజలనుంచి, ప్రజా జీవితాల నుండి ఉద్భవించిన పార్టీ తెలుగుదేశం.

ముఖ్యమంత్రి అంటే అందరికీ అభిమానం వుంది. వ్యవసాయ రంగంలో, పారిశ్రామిక రంగంలో, విద్యా రంగంలో, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో, వివిధ రంగాలలో సాధించిన విజయాలు ప్రజలకు సందర్భోచితంగా గుర్తు చేస్తుండాలి, కానీ ఒక్క ఎలక్షన్ సమయంలో మాత్రమే కాదు. తెలుగుదేశానికి యువత ప్రాణం, వారే పరిస్థితులు అర్థం చేసుకొని పరిష్కారాన్ని అన్వేషించగలరు. సాహసాన్ని నవ్యతను ప్రోత్సాహించే యువతీ యువకులు ముందుకు రావాలి. తెలుగుదేశం కార్యకర్తల్ని తెలుగుదేశం నాయకులు సరిగ్గా ఉపయోగించుకొని అవకాశాలు యిస్తే తమ సామర్థ్యాన్ని ఋజువను చేసుకోగలరు. ఈనాడు యువతీ యువకులు తెలుగుదేశం పార్టీకి ఏమి ఇవ్వగల్గుతారో భవిష్యత్‌లో అదే ఫలితం పొందగలరు.

ప్రపంచ ప్రసిద్ధి చెందిన చారిత్రాత్మక వ్యక్తి విశ్వ విఖ్యాత నటసార్వభౌమ నందమూరి తారక రామారావు గారు స్థాపించిన పార్టీ కాబట్టే తెలుగుదేశం కీలక పాత్ర పోషించే సంచలనాత్మక పార్టీఅయ్యింది. తెలుగు ప్రజల మనోభావాలకు ప్రతి బింబమే తెలుగుదేశం. భారతావనిలో లోక్‌సభ స్పీకర్ పదవి మనకి దక్కిందంటే అది సామాన్య విషయం కాదు. ఆంధ్రుల శ్రేయస్సు కోరేవారికి చంద్రబాబునాయుడు ఆప్తుడే. అతని మేధాశక్తి ఆంధ్రులకి ఎంతో అవసరము.

తెలుగుదేశం పార్టీలో చైతన్యం ఉంది. శక్తివుంది. ప్రజల్లోకి దూసుకు పోగల కార్యకర్తలు కావాలి. ఇతను ఫలానా పని చేయగలడు. ఈమె ఫలానా పని చేయగలదు అని మనకు బాగా తెలిసిన మనుష్యుల్నే కార్యకర్తలుగా చేయాలి. మనలో గల అసంతృప్తిని మరచిపోయి ఏకత్రాటి మీద నడిపించేందుకు ఆత్మతృప్తిగా పని చేయాలి. మీ చర్యలను బట్టే ఫలితాలు ఉంటాయి. మీ ఇబ్బందులను మీరు దాపరికం లేకుండా చెప్పండి. ద్వేషాన్ని, అసూయని సహకారం వైపు మళ్ళించండి. ఓర్పుతో శాంతియుతంగా మార్పు ఆశించండి. ఆచరణ యోగ్యమగు విధానాలనే ప్రజల్లో ప్రచారం చేసి వాగ్దానాలు చెయ్యండి. స్వప్రయోజనాలకోసం ప్రజలతో సంబంధం పెంచుకోకుండా పార్టీకోసం ప్రజలతో సంబంధం పెంచుకోండి.

తెలుగుదేశం అంటే నీది నాది మనందరిది. ఆంధ్రదేశాన్ని అభ్యుదయం వైపు నడిపించేది ఒక్క తెలుగుదేశమే. నీతి వంతమైన సమర్ధవంతమైన పరిపాలన అందించగల సత్తా, గుండెల్లో దమ్మున్న తెలుగుబిడ్డ మననారా చంద్రబాబునాయుడు గారంటే...... అందరికి అభిమానమే. ఇలాంటి యంగ్ లైన్ ముఖ్యమంత్రిని ప్రజలు ఆరాధిస్తారు. ఆశీర్వదిస్తారు.

జై తెలుగుదేశం ! జై చంద్రబాబు!!



# ముఖ్య సేవకుడు - 2

రాష్ట్రప్రభుత్వం నిర్వహించిన జన్మభూమి మహిళల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి వారిలో అంతర్లీనంగా దాగిఉన్న ఆవేదనను పోగొట్టేలా ఊరట కల్గించింది. మహిళా జన్మభూమిలో అనూహ్య స్పందన లభించింది. ఇది సామాజిక ఉద్యమానికి శ్రీకారం. మహిళల్లో మునుపెన్నడు లేనంత ఉత్సాహం ఆత్మవిశ్వాసం కల్పిస్తున్నాయి. అన్నింటా అణచివేతకు గురవుతున్నా మహిళకు ఎండల్ని సైతం లెక్క చేయకుండా ప్రభుత్వ యంత్రాగం శ్రమిస్తే కొందరు హైదరాబాదులో ఏసీ రూముల్లో కూర్చొని ఏమీ జరగడం లేదని విమర్శలు చేయడం బాధాకరం. గ్రామాల్లోని కాంగ్రెస్ నాయకులు ప్రజలకు దూరమైపోతామనే భయంతో జన్మభూమిలో పాల్గొన్నామన్నారు. కొందరైతే అసూయతో నోడల్ ఆఫీసర్లను పార్టీ వారిని నిర్బదించినారని, ప్రజలకు తమ పనులు జరుగుతాయనే నమ్మకం కుదిరితే మరిన్ని కోర్కెలతో వస్తారని అన్నీ చేయలేం కనుక దశల వారీగా పరిష్కరించాల్సి ఉంటుందని చంద్రబాబు చెప్పారు. అనేకచోట్ల తన షర్టు పట్టుకొని చేతులు లాగుతూ ఎన్నో ఫిర్యాదులు చేశారని, ప్రజల్లో ఉన్నప్పుడు సహనంతోవారి గోడు విని తగు విధంగా స్పందించాల్సి ఉంది. మహబూబ్ నగర్‌లో జరిగిన మహిళల ర్యాలీ భారతదేశంలోనే అపూర్వమని ముఖ్యమంత్రి అభివర్ణించారు. మనిషికి కావలసిన కనీస అవసరాలైనటువంటి కూడు, నీడ, గుడ్డలలో అత్యంత ప్రాముఖ్యత కలిగింది. గృహావశ్యకత, దీనిలో భాగంగా

అట్టడుగు ప్రజానీకంలో ప్రతి ఒక్కరికీ తనదంటూ ఒక స్వంత గృహాన్ని ఏర్పాటు చేయాలనే సంకల్పనంలో బలహీనవర్గంగా గృహ నిర్మాణ పథకాన్ని రాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. రాష్ట్రంలో ఈ కార్యక్రమాన్ని 1979 సం!!లో తుఫాను బాధితులకు శాశ్వత గృహ నిర్మాణం మొదలు పెట్టినప్పటికి 1983 వసం!!లో నుంచి శాశ్వత గృహాలను నిరుపేద లందరికీ నిర్మించాలనే సంకల్పంలో పెద్ద ఎత్తున ఈ కార్యక్రమాన్ని చేపట్టి యిప్పటి వరకూ 30,24,525 గృహాలను గ్రామీణ ప్రాంతాల్లోను 2,85,723 గృహాలను పట్టణ ప్రాంతాల్లోను నిర్మించి దేశంలోనే బలహీన వర్గాలకు ఒక నీడ కల్పించే పథకాలలో అగ్రగామిగా నిలిచింది.

- 1997-1998 మరియు 1998-1999 సం!! రాలకు గాను హడ్కో-ఔట్ స్టాడింగ్ ఫెర్ఫార్మెన్స్ అవార్డు.
- గృహనిర్మాణ పథకమును పటిష్టంగా అమలు పరుచుట కొరకు లబ్ధిదారులకు పర్యవేక్షణ కార్డులు.
- 1999-2000 సం!! రాలకు 5,00,000 గృహాలు గ్రామీణ ప్రాంతాలల్లోను 60,000 గృహాలు పట్టణ ప్రాంతాల్లో నిర్మాణం.
- గృహ నిర్మాణానికి కావలసిన ఆర్థిక సాంకేతిక సహకారం.
- గృహ నిర్మాణానికి కావలసిన సిమెంటు ,స్టీలు, నాణ్యత కల్గిన యితర సామాగ్రి సరఫరా.
- లబ్ధిదారులకు చెందవలసిన ఆర్థిక సహాయము, బ్యాంకు ద్వారా వారి ఖాతాల ద్వారా చెల్లింపు.

- లబ్ధిదారులకు తక్కువఖర్చులో ఎక్కువ మన్నిక గల గృహ నిర్మాణ సామాగ్రిని అందించుటకు రాష్ట్రం మొత్తం మీద నేటికి 76 నిర్మిత కేంద్రాలలో ఏర్పాటు.

- 1998-1999 సం!!లో 3,60,000 గృహాలు గ్రామీణ ప్రాంతాల్లో 40,000 గృహాలు మంజూరు.

- లబ్ధిదారులు గృహ నిర్మాణంలో పొందిన ఆర్థిక సహాయంలోని ఋణ సౌకర్యాన్ని నిర్ణీత గడువులో ఎప్పటి కప్పుడు కేవలం 7% సాధారణ వడ్డీతో చెల్లించవలెను.



దేశంలోని అత్యున్నత పదవులకై భారతీయులకే అర్హత ఉండేలా రాజ్యాంగ సవరణ చేయాలని నేర చరిత్ర గల నాయకులకు ప్రజలు ఎన్నికల్లో ఓడించడమే కాకుండా సాంఘిక బహిష్కారం చేయాలని కోరుతూ తెలుగుదేశం తీర్మానించింది. 2 రోజులు మహానాడు సందర్భంగా ఇక్కడ ఆరంభమైన పార్టీ ప్రతినిధులు మహాసభలో 43 తీర్మానాలను ఆమోదించారు. వీటిలో పార్టీ కీలకమైనదిగా భావిస్తున్న రాజకీయ తీర్మానాలపై సుదీర్ఘ చర్చ జరిగింది. రాష్ట్ర ప్రభుత్వాలను కూలదోసే 356 అధికరణాన్ని పార్లమెంటు రెండు సభలు ఆమోదించి నప్పుడు కల్లోలాలు ఎక్కువైనప్పుడు తప్ప మిగతా సమయాల్లో ప్రవేశ పెట్టకూడదు. అధికారంలో ఉన్న ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టేముందు ప్రత్యామ్నాయ ఏర్పాట్లును సిద్ధం చేసుకోవాలి. ఎన్నికల సంస్కరణలపై కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలతో చర్చించాలి గవర్నర్లను

నియమించే ముందు రాష్ట్ర ప్రభుత్వాలతో సంప్రదించాలి. వంటి తీర్మానాలు చోటుచేసుకున్నాయి. ముసాయిదాలో లేని గవర్నర్ల వ్యవస్థ 356 అధికరణ వంటి వాటిని ఆయా నాయకులు ప్రతిపాదించారు. సభకు హాజరైన ప్రతినిధులంతా హర్షధ్వానాలతో వాటికి ఆమోదాన్ని తెలిపారు. పౌరసత్వాన్ని పొందిన విదేశీ వ్యక్తికి భారతదేశంలో అత్యున్నత రాజ్యాంగ పదవిని పొందే అర్హత ఉందా? లేదా? అనే వివాదాస్పద అంశంపై విస్తృత స్థాయిలో జాతీయ చర్చ జరగడం ఎంతైనా అవసరమని తెలుగుదేశం తన తీర్మానంలో పేర్కొంది. తమ దేశాల్లో జన్మించిన వారే అత్యున్నత పదవులకు అర్హులంటూ ఇటలీ , ఫిన్లాండ్, జర్మని, థాయ్‌లాండ్, సింగపూర్, తదితర దేశాలు స్పష్టం చేస్తున్నాయని నాయకులు పేర్కొన్నారు. గతంలో భారతదేశానికి చెందిన బెంగాలీ సినీనటి సోనాలీ ప్రఖ్యాత ఇటాలియన్ సినీ దర్శకుడు రాబర్ట్ రోసిలీని వివాహం చేసుకొని ఇటలీలో స్థిరపడిన తర్వాత ఆ దేశ మునిసిపల్ ఎన్నికల్లో పోటీ చేయడానికి ప్రయత్నించినప్పుడు ఇటలీ దేశ చట్టం ప్రకారం ఆమెకు అర్హత లేదని తిరస్కరించారంటూ ఉదహరించారు. అతి ప్రాచీన కాలం నుండి భారతదేశానికి బలమైన జాతీయతాభావం ఉందని చెబుతూ దానికి తార్కాణంగా చరిత్ర పుటలనుకూడా తిరగేశారు. యుద్ధంలో ఓడిపోయిన సైన్యాధిపతి సెల్యూకస్ కుమార్తెను చంద్రగుప్త మౌర్యుడు వివాహం చేసుకున్న సందర్భంలో చాణక్యుడు ఆ వివాహం వల్ల చంద్రగుప్త మౌర్యునికి కలిగే సంతానం మగధ సామ్రాజ్య సింహాసనానికి వారసులు కాలేరని చెప్పినట్లు ప్రస్తావించారు. మన దేశంలో అసంఖ్యాకులైన పేదలు ప్రాతినిత్యం కొనసాగించే జీవన పోరాటం ఏమిటో ? ఈ దుమ్మూ, ధూళిలో కలిసిపోయే వారికే

అర్ధమవుతుంది. ఈ దేశ ప్రజల కష్టనష్టాలు సుఖ దుఖాలలో మమేకమైన వ్యక్తి మాత్రమే భారత జాతిలోని ఔన్నత్యాన్ని స్ఫూర్తిని నిజంగా అర్ధం చేసుకోగలడు. క్రియాశీల సభ్యులుగా చేసేవారు. అంతకు ముందు కనీసం రెండేళ్ళ పాటు ప్రాధమిక సభ్యులుగా ఉండాలన్న నిబంధనను తెలుగుదేశం పార్టీ తొలిగించింది. పార్టీ ప్రతినిధుల సభ ఆమోదించిన నియమావళి సవరణల్లో ఇది కూడా ఉంది. గ్రామాలు పట్టణాల్లో కొత్తగా బూత్ కమిటీల వ్యవస్థ ఏర్పాటుకు సమావేశం ఆమోదం తెలిపింది.కొత్తగా చేసిన మార్పు ప్రకారం గ్రామ వార్డు బూత్ కమిటీల వ్యవస్థ ఏర్పాటుకు సమావేశం ఆమోదం తెలిపింది. కొత్తగా చేసిన మార్పు ప్రకారం గ్రామ, వార్డు బూత్ కమిటీల్లో ఇక ముందు 5 గురే కార్యవర్గ సభ్యులు ఉంటారు. అన్నీ స్థాయిలో కమిటీల్లో బలహీన వర్గాల వారు, మహిళలు, దళితులు, గిరిజనులు, మైనారిటీలకు, ప్రాతినిద్యం తప్పని సరి చేశారు. మండల స్థాయిలో ఈ వర్గాల వారి నుండి కొందరిని అదనంగా కో-ఆప్షన్ ద్వారా కమిటీల్లోని తీసుకోవడానికి అవకాశం కల్పించారు. మండల స్థాయిలో ఇంతవరుకూ కో-ఆప్షన్ సభ్యులుగా ఉన్న వారు ఇకముందు సాధారణ కమిటీ సభ్యులుగా పరిగణిస్తారు. వ్యవసాయ, నీటిపారుదల రంగానికి అత్యధిక ప్రాధాన్యమిచ్చి తద్వారా ఆహారధాన్యాల దిగుబడులు గణనీయంగా పెంచినందుకు తెలుగుదేశం రాష్ట్ర ప్రతినిధుల మహాసభ ప్రభుత్వాన్ని అభినందించింది. ఈ కృషిని ఇదే విధంగా కొనసాగించాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు విన్నవించింది. గతంలోని ప్రభుత్వాలు వ్యవసాయ రంగాన్ని నిర్లక్ష్యం చేసినారైతే దేశానికి వెన్నెముక అని విశ్వసించడమే గాక ముఖ్యమంత్రి ఆచరణలో చేసి

చూపించి, ఆహారధాన్యాల దిగుబడి 125 లక్షల టన్నుల నుండి 148 లక్షల టన్నులకు పెరిగింది. ఆహార నిర్దేశిత సమయంలో ప్రాజెక్టులు పూర్తి చేయటానికి కార్యాచరణలో ముందుకు వెళ్తున్నారు. ఒక్క- సం!!లోనే 5 లక్షల ఎకరాల అదనపు ఆయువుకట్టుకు నీరు అందించగలిగారు. ముఖ్యమంత్రి పట్టుదల వల్లనే కృష్ణా డెల్టా ఆధునీకరణ పులిచింతల, భీమాఎత్తిపోతల పధకం, శ్రీరాంసాగర్ రెండోదశ, శ్రీరాంనగర్ కాల్వకుసాంకేతిక, ఆర్థిక అనుమతులు లభించాయి. రాష్ట్రాభివృద్ధి -శాంతి, సామరస్యం, మత సామరస్యం, లౌకిక వివాదంపై సంబంధించినది. రాష్ట్రంలో శాంతి భద్రతల పరిరక్షణ కు ప్రభుత్వం అన్ని చర్యలు తీసుకుంటుందనే విషయంలో రాజీలేదని, శాంతి భద్రతలకు విఘాతం కలిగించే సంఘ వ్యతిరేఖ శక్తులు, పార్టీలపట్ల నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తున్నారు. విద్యుత్, పారిశ్రామిక, కార్మిక విధానం, ఇన్ఫర్మేషన్ టేక్నాలజీ- రాష్ట్రప్రగతి మౌళిక సదుపాయాల విస్తరణ, పర్యాటక సాంస్కృతిక, కళారంగాలకు ప్రోత్సాహం. రాష్ట్రఆర్థిక సంస్కరణలు ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పునర్నిర్మాణం పథకం వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి, అవినీతి నిర్మూలన, ఆంధ్రప్రదేశ్ విజన్-2020 ప్రభుత్వం ఎంతో కృషి చేస్తోంది. సామాజిక భవిష్యత్తును తేల్చేవి. రాజకీయాలేనని, అటువంటి రాజకీయ రంగంలో మంచి వ్యక్తులు ప్రవేశించి విధంగా ప్రజలు చైతన్యవంతులై వ్యవహరించాలి. అన్ని రంగాల్లోకెల్లా రాజకీయ రంగం ఉచ్చస్థితిలో ఉన్నందున ఆరంగాన్ని మంచి నడవడిక ఉన్న వ్యక్తులతో నింపాల్సిఉంది. రాజకీయలలో సంబంధం పరిస్థితులను మార్చాలి. ఖచ్చింతగా ఓటేయడంతో పాటు ప్రభుత్వం ఎలా పనిచేస్తోందో తనిఖీచేసే బాధ్యత కూడా ప్రజలదే

ఓటర్లలో బాధ్యత పెరిగితే ప్రభుత్వాలు కూడా చిత్తశుద్ధితో వ్యవహరిస్తాయి. దీనిపై పార్టీ కార్యకర్తలు ప్రజల్లో ప్రచారం చేయాలి. ఆరోగ్యం, విద్య, సామాజిక సమస్యల పరిష్కారం వేదికగా జన్మభూమి కార్యక్రమం రూపొందాలని చంద్రబాబు నాయుడు పేర్కొన్నారు. జన్మభూమి స్వయం సహాయక సంఘాలు పచ్చదనం-పరిశుభ్రత, స్థానిక సంస్థల, స్వావలంబన, ప్రభుత్వ విధానం అంశంపై మహాసభ తీర్మానించింది. దీని సందర్భంగా మాట్లాడుతూ దీనిపై పార్టీశ్రేణులు మరింత దృష్టి నిలపాలని కోరారు. అన్ని రంగాల్లోనూ అభివృద్ధి జరిగే వరకు జన్మభూమి కార్యక్రమాన్ని కొనసాగించాల్సిందేనని పేర్కొన్నారు. పాకిస్థాన్ ఉగ్రవాదుల చర్యలను ఖండిస్తూ వారిపై కఠిన చర్యలు తీసుకోవల్సిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని ముఖ్యమంత్రి డిమాండ్ చేశారు. కేంద్ర, రాష్ట్ర సంబంధాల అంశానికి సంబంధించిన తీర్మానంపై వ్యాఖ్యానిస్తూ, రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలిచ్చే పరిస్థితిని తెలుగుదేశమే తీసుకువచ్చిందని చెప్పారు. ఇటీవల పరిణామాల్లో ప్రభుత్వం ఏర్పాటుకు కావాల్సిన మద్దతును నేర చరిత్ర గల రాజకీయ నాయకులను ఎన్నికల్లో ప్రజలే తరిమికొట్టాలని, అటువంటి వారికి ఏ విధంగాను సహకరించకుండా సాంఘిక బహిష్కారాన్ని అమలు చేయాలని మహానాడు ప్రతినిధుల సభ తీర్మానం ద్వారా పిలుపునిచ్చింది. నేర చరితుల కారణంగా రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలు అభివృద్ధి కాకుండా పోతున్నాయి.

వివిధ రాష్ట్రాల్లో ప్రజల మద్దతు గల ప్రాంతీయ కో-ఆపరేటివ్ ఫెడరలిజం స్ఫూర్తితో జాతీయ ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటుకు కృషి చేయాలని తెలుగుదేశం కోరుకొంటోంది.

జాతీయ రాజకీయ పరిణామాలు అనే అంశంపై చేసిన తీర్మానంలో ప్రజల ఆశయాలకు, ఆకాంక్షలకు ప్రతిబింబంగా నిలిచే ప్రాంతీయ పార్టీలు దేశానికి రాజకీయ ప్రత్యామ్నాయాన్ని అందిండంలో కీలకపాత్ర వహిస్తాయని అభిప్రాయపడ్డారు. బాబ్రీమసీదు కామన్ సివిల్ కోడ్ ఆర్టికల్ 356 వంటి వివాదాస్పద అంశాలను బి.జె.పి దాని మిత్రపక్షాలు పక్కనపెట్టి ఒక జాతీయ జెండాను ఖరారు చేశాయి. ఈ నేపథ్యంలో అనిశ్చితిని తొలిగించి ఆర్థికాభివృద్ధికి తోడ్పడాలనే ఉద్దేశంతోను ఎన్నికల వ్యయాన్ని తప్పించడం కోసం వాజ్‌పేయి నాయకత్వంలోని సంకీర్ణ ప్రకటించింది అని తెలిపారు. నీటి పారుదల యాజమాన్యంపై రైతులకు బాధ్యతను నియంత్రణను అప్పగించడం ద్వారా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం వారి జీవితాలనే మార్చివేసింది. వెలుగు బాట వైపు పయనింప జేసింది. అపారమైన దూరదృష్టిగల ముఖ్యమంత్రి శ్రీ నారాచంద్రబాబు నాయుడు సమర్థ సారధ్యంలో 10,000 కుపైగా సాగునీటి సంఘాలు ఏర్పాటు చేశారు. 1997 జూన్‌లో ఎపి.ఎఫ్. ఎం.వి.యస్ చట్టం క్రింద ఏర్పాటైన ఈ సంఘాలకు వారి ప్రాంతాలలోని నీటి పారుదల వ్యవస్థలపై యాజమాన్యాన్ని నియంత్రణను అప్పగించారు. ఇందుకు గాను 1997 జులై- ఆగస్టు లో రూ.40 కోట్ల ప్రోత్సాహక మొత్తాన్ని విడుదల చేశారు. 1997 నవంబర్‌లో 174 పంపిణీసంఘాలకు ఎన్నికలు జరిగాయి.ఎన్నికైన అధ్యక్షులకు జిల్లా స్థాయిలో 2 రోజుల పాటు శిక్షణ యిచ్చారు. ఫలితంగా సాగునీటి సంఘాల పనితీరు మరింతగా ఇనుమడించింది. ప్రభుత్వం ప్రతి 3 నెలలకు ఒకసారి ఈ సంఘాలపై పర్యవేక్షణ నిర్వహిస్తుంటుంది. ప్రతి నీటి పారుదల సం!!

ప్రారంభంలో ఈ సంఘాలపై నిర్వహణా ప్రణాళికను తయారు చేయాలి. కాలువలు మూసివేసే కాలంలో నిర్వహణా పనులు చేపట్టే బాధ్యత కూడా ఈసంఘాలదే. ఈ సంఘాలు రికార్డులు నిర్వహిస్తాయి. అలాగే సోషల్ ఆడిట్‌తో పాటు నీటి బడ్జెటింగ్ చేపడతాయి. అకౌంట్లను ఆడిట్ చేయించుకుంటాయి. అప్పుడప్పుడు ఇవి రెండు పక్షాల మధ్య వివాదం ఏర్పడితే వాటిని పరిష్కరిస్తుంటాయి. 1997 లో ప్రారంభమైన ఈసంఘాలు రైతుల జీవితాలలో కొత్త కాంతులునింపాయి. 1998 లో రూ.107 కోట్ల వ్యయంలో 22,171 పనులు చేపట్టారు.

సాగునీటి సంఘాలకు మంజూరైన నిధులు:-ప్రస్తుత సంవత్సరంలో నిర్వహణ కనీస పునరావాసం వరద నిధులు ఎం.వి వనరుల పునరుద్ధరణ నిమిత్తం ప్రభుత్వం రూ.546 కోట్ల మంజూరు చేసింది. ఎపిఇఆర్‌పి కింద సాగునీటి పంపిణీ సంఘాల చే రూ .297.23కోట్ల వ్యయంతో మొత్తం 18,383 పనులు చేపట్టాలని ప్రతిపాదించడమైనది.

ప్రయివేట్ సంస్థలచే సర్వేకు అనుమతి రూ10 లక్షల కన్నా తక్కువ వ్యయం గల పనులకు జిల్లా స్థాయిలో అంతర్గత నాణ్యతా నియంత్రణ రూ.10 లక్షలు పైబడిన పనులకు నాణ్యత నియంత్రణ విభాగం చే నాణ్యత నియంత్రణ పంపిణీ సంఘాలకు పాలనా పరమైన ఖర్చుల కోసం ఏటా రూ. 25,000 భారీ సాగునీటి సంఘాలకు రూ. 10,000 మధ్యతరహా సంఘాలకు రూ.5,000 చిన్న తరహా సంఘాలకు రూ.2,500 అధ్యక్షులు ప్రాదేశిక నియోజిక వర్గ సభ్యులకు ఒకరోజు జిల్లా స్థాయి సదస్సు అన్నీ సాగునీటి సంఘాల

అధ్యక్షులు , సభ్యులకు శిక్షణా కార్యక్రమాలు, అన్నీ సాగునీటి సంఘాలు సర్వసభ్య సమావేశాలు నిర్వహిస్తాయి. ప్రతీవారు మేనేజింగ్ కమిటీ సమావేశం ఖాతాలు రావడం, క్యాష్‌బుక్ నిర్వహణ తరుచుగా జరగాలి. సాధారణ ప్రజానీకం కోసం సాగునీటి సంఘాలు చేపట్టే పనుల వివరాలను గ్రామ పంచాయితీ భవనాలు పాఠశాల భవనాల గోడలపై ప్రదర్శన పనులు నాణ్యమైన రీతిలో జరుగుతున్నట్టు సాగునీటి సంఘాలే చేసుకోవాలి . భారీ ప్రాజెక్టుల వద్ద ప్రతీ సర్కిల్ కు వైర్‌లేస్ సెట్ల కోసం రూ.5 లక్షలు మంజూరు చేశారు. నెలకు రూ. 12,000 సీలింగ్‌లో వాహనాలు అద్దెకు తీసుకోవడానికి అనుమతి సాగునీటి సంఘాలు చేపట్టిన పనుల కోసం 15 శాతం నగదు లేదా వస్తురూపంలో విరాళాలు సాగునీటి సంఘాలు పంపిణీ సంఘాలు వాటికి మంజూరు చేసిన పాలనాపరమైన ఖర్చులలో నుంచి సాంకేతిక నిపుణుల సేవలను తీసుకోవాలి.

చేపట్టిన పనులు ప్రత్యక్షంగా జరుగుతాయి. ఆయుకట్టు ప్రాంతం మొత్తంలో ఒకేసారి పనులు అమలుఅంచనా రేట్లపై పనుల అమలు పనులపై మెరుగైన పర్యవేక్షణ అంచనా కన్నా ఎక్కువ సంఖ్యలో పనులు సాగునీటి సంఘాలచే స్వయంగా పనుల ఎంపిక సాగునీటి సంఘాలకు స్వయంగా నిధులు సర్వేల నిర్వహణ ప్రయివేటీకరణకు ప్రాతిపదికగా వాక్ త్రూ సర్వేలు.

మహిళా ఆర్థిక సామాజిక రాజకీయ సమానత్వం చైతన్యం సాధించే దిశలో ప్రస్తుత మహిళ జన్మభూమి ఒక ఆరంభం మాత్రమేనని చంద్రబాబు నాయుడు స్పష్టం చేశారు. మహిళలు ఏవిధంగా మగవారికి తీసిపోరని. జన్మభూమి సందర్భంగా

వెల్లడయిందని పేర్కొంటూ వారి సంక్షేమానికి ఏది కావాలి అన్నీ చేయడాని ప్రభుత్వం సిద్ధంగా ఉందన్నారు. మహిళా జన్మభూమి వల్ల ఏ విధంగా మేలు జరుగుతుందో మీరు మీమీ గ్రామాలకు వెళ్ళిన తర్వాత ప్రతి మహిళను సవివరంగా చెప్పాలని ముఖ్యమంత్రి కోరారు. చట్ట సభల్లో మహిళలను 33 శాతం రిజర్వేషన్ కల్పించే విషయంలో తెలుగుదేశం పట్టుదలతో కృషిచేస్తుందని ముఖ్యమంత్రి వెల్లడించారు. దీన్ని వ్యతిరేకించే వారికి మహిళలే బుద్ధి చెప్పాల్సి ఉంటుందన్నారు. మహిళలను ఉండే గ్రామాల్లో సంఘీభావం ఏర్పడి సమన్వయంతో సమిష్టి కృషి తో మరింత అభివృద్ధి సాధ్యమవుతుంది. కొన్ని గ్రామాల్లో ముఠా కక్ష్యలు తగాదాలను కూడా మహిళా జన్మభూమి అదిగమించి ఎంతో చక్కటి సంతోషకరమైన వాతావరణాన్ని నెలకొల్పింది.



రాష్ట్ర ప్రభుత్వం మహిళల కోసం ప్రత్యేకంగా చేపట్టిన జన్మభూమి కార్యక్రమానికి వినూత్నమైన రీతిలో స్పందన కనిపించింది. అన్ని జిల్లాల్లో పెద్ద సంఖ్యల్లో గ్రామ సభలు జరిగాయి. కొత్తగా అనేక ప్రాంతాల్లో మహిళల పొదుపు సంఘాలు ఏర్పాడ్డాయి. ఈ విడత జన్మభూమి మహిళల భాగస్వామ్యంతో గ్రామ, మండల, జిల్లాకేంద్రాల్లో భారీగా ప్రదర్శనలు జరిగాయి. మొదటి 6 రోజుల్లోనే 36,270 మంది వితంతువులకు1,77,916 మంది వృద్ధ ఆశ్రమం లేని వారికి పెన్షన్లుయిచ్చారు. బాలికా సంరక్షణ పథకం క్రింద 21,545 పాతపుస్తకాలను పంపిణీ చేశారు. 67,888 మంది

మహిళలకు ఇళ్ళ పట్టాలు ఇచ్చారు. 32,825 మహిళా పొదుపు సంఘాలు ఏర్పడ్డాయి. ప్రత్యేక ఆరోగ్య శిబిరాల్లో 3,36,691 మంది మహిళలను చికిత్స చేశారు. ఎ.పి.ఆర్.పి కింద 5,370 అంగన్‌వాడి కేంద్రాలను 19,182 తల్లుల కమిటీలను ప్రారంభించారు. వరకట్నం ,అంటరానితనం, బాల్యవివాహాలను నిరసిస్తూపలుచోట్ల ప్రదర్శనలు నిర్వహించారు. మహిళా సమస్యలకు జన్మభూమిలో సగం జిల్లాలను రాష్ట్ర ముఖ్యమంత్రి స్వయంగా చుట్టి వచ్చారు.



అపారెల్ ట్రైనింగ్ అండ్ డిజైనింగ్ సెంటర్. అపారెల్ ఎక్స్‌పోర్ట్ ఎగ్జిబిషన్ సెంటర్ల ఏర్పాటుకు రాష్ట్ర ప్రభుత్వం చొరవ తీసుకుంటున్నట్లు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుగారు అన్నారు. ఒక్కో సెంటరు ఏర్పాటుకు 5 ఎకరాల చొప్పున 10 ఎకరాల స్థలాన్ని యిచ్చేందుకు సంసిద్ధత వ్యక్తం ఈ రెంటి ఏర్పాటులో సహకరించవల్సిందిగా కేంద్ర జౌళి మంత్రి కాశీరామ్ రాణాను కోరారు. నగరానికి సమీపంలోని మదాపుర్ వద్ద నిర్మితమైన నేషనల్ ఇనిస్టిట్యూట్ ఫ్యాషన్ టెక్నాలజి భవన సముదాయం ప్రారంభోత్సవం జరిగింది. ఈ సందర్భంగా ఏర్పాటైన కార్యక్రమంలో ముఖ్య అతిధిగా పోల్గొన్న ముఖ్యమంత్రి చంద్రబాబు మాట్లాడుతూ రాష్ట్రంలో రెడీమెడీ గార్మెంట్స్ పరిశ్రమ వృద్ధికి గల అంశాలను దృష్టిలో ఉంచుకునే నిఫ్ట్ ఏర్పాటుకు రాష్ట్ర ప్రభుత్వం చొరవ తీసుకుంటుందని అన్నారు. నిఫ్ట్ ఏర్పాటుకు రాష్ట్రప్రభుత్వం 5 ఎకరాల స్థలాన్ని ఉచితంగా ఇవ్వడంలో పాటు రూ.1.32 కోట్లను

గ్రాంటుగా అందించనున్నట్లు పేర్కొన్నారు. జౌళి పరిశ్రమ ఆధునికీకరణకు ఏర్పాటు చేసిన రూ.25 వేల కోట్ల ఫండ్‌ను సద్వినియోగపరుచుకోవల్సిందిగా పరిశ్రమల రంగాన్ని కేంద్ర జౌళి మంత్రి కాశీరామ్ రాణా కోరారు. అంతర్జాతీయికరణ నేపధ్యంలో భారత జౌళి పరిశ్రమ పోటీని తట్టుకునేలా తీర్చిదిద్దేందుకు కొత్త జౌళి విధానాన్ని రూపొందించనున్నట్లు చెప్పారు.



మహానాడు సందర్భంగా తెలుగుదేశం పార్టీ హైదరాబాదులో నిర్వహించిన భారీ ఊరేగింపు కన్నుల పండుగగా సాగింది. ఉప్పెనలా తరలి వచ్చిన జల ప్రవాహం ఉరకలెత్తిన ఉత్సాహంతో జంట నగరాల రోడ్లపై కదం తొక్కింది. నిజాంకళాశాల, లాల్‌బహదూర్, స్టేడియం నుంచి ప్రారంభమైన ర్యాలీ లిబర్టీ, ట్యాంక్ బండ్ ,రాష్ట్రపతి రోడ్ , సర్దార్ పటేల్ రోడ్లమీదగా సికింద్రాబాద్ పరేడ్ గ్రౌండ్స్‌కు చేరింది. బ్యానర్లు పార్టీ పతాకాలు, కార్యకర్తలతో రాజధాని నగరం పసుపు రంగు పండుగ చేసుకుంది. రాష్ట్రంలో నిజాం కళాశాల మైదానం నుండి ఉత్సాహంగా ర్యాలీలో పాల్గొన్నారు. మధ్యాహ్నం 1.30 గం!! లకు నిజాం కళాశాల మైదానం నుండి ప్రారంభమైన ఉరేగింపు 6.5 కిలోమీటర్ల దూరంలోని పరేడ్ గ్రౌండ్స్ చేరడానికి 3గంటస సమయం పట్టింది. సాయంత్రం 6.30 గం!!లకే పేరెడ్ గ్రౌండ్స్ నిండిపోవడంతో వేలాది మంది జింఖానా మైదానం ఎన్.సి.సి. గ్రౌండ్స్ సికింద్రాబాద్ లోని వివిధ ప్రాంతాల్లో నిల్చుండిపోయారు. ర్యాలీ 1.30 గం!! లకే

ప్రారంభమైన ముఖ్యమంత్రి చంద్రబాబు వచ్చిన తర్వాత ఊపందుకుంది. మధ్యాహ్నం 3.50 గం!!లకు ఆయన పూలతో అలంకరించిన మినీ వ్యాన్‌లో ట్యాంక్‌బండ్ అంబేద్కర్ చౌరస్తా వద్ద ర్యాలీలో కలిశారు. విక్టరీ సంకేతంలా రెండు వేళ్ళు ఊపుతూ కార్యకర్తలకు అభివాదం చేస్తూ కదిలారు.



అందరూ కష్టపడితే స్వర్ణాంధ్రప్రదేశ్ అవుతుంది. లేదంటే బాంబుల ఆంధ్రప్రధేశ్, శ్మశానాంధ్రప్రధేశ్ అవుతుంది. మన రాష్ట్రంలో ఉన్న వనరులు, వసతులు ఎక్కడాలేవు కాని ఉపయోగించుకోలేకపోతున్నాం. ఎన్నో సంరక్షణ కార్యక్రమాలు చేపడుతున్నాం. పనులు మంజూరు చేస్తున్నాం. నిధులు ఇస్తున్నాం. ఎన్నో సంక్షేమ కార్యక్రమాలు అమలు చేస్తున్నాం. ఇంతకన్నా ఏం చేయగలం అని ముఖ్యమంత్రి చంద్రబాబు అన్నారు. అవినీతి జరక్కుండా సాధ్యమైనంతవరకు చర్యలు తీసుకుంటామని ఇంటెలిజెన్స్ ద్వారా సమాచారాన్ని రప్పించుకొంటున్నాను. కొంచెం ఏమరుపాటుగా ఉన్నా తినేయాలని చూసేవాళ్ళు ఉన్నారు. అవినీతి జరుక్కుండా తాను కాపలా కాస్తున్నాను. అవినీతుల భరతం పడతానని చెప్పారు. చెట్ల కిందస్కూళ్లు, ఆసుపత్రులు ఉన్నాయి. కనీస అవసరాలుతీర్చే ప్రాధమిక సౌకర్యాలు కూడా కరువైన పరిస్థితుల్లో అప్పులు గ్రాంట్లు తెచ్చి అన్నింటినీ ఆదర్శవంతంగా తీర్చదిద్దుతుంటే ప్రతి పక్షాలు విమర్శిస్తున్నారని అన్నారు. వారి విమర్శలు కాదు. మీ ఆశీర్వాదాలు కావాలి. పడుకునే సమయం తప్ప మిగిలిన

సమయమంతా కష్టపడుతున్నాను. మండుటెండలు, వానాకాలం,పండుగలు సెలవు దినాలు అనిలేకుండా ప్రజల కోసం తిరుగుతున్నాను. అధికార యంత్రాంగంతో పని చేస్తున్నాను. రాబోయే కాలంలో మహిళలే అన్ని రంగాల్లో కీలకపాత్ర వహించబోతున్నారు. బంగారం లాంటి భూములు బ్రహ్మాండమైన తెలివి తేటలు అన్ని వనరులు ఉన్న మన రాష్ట్రం అభివృద్ధి పథంలోని పయనించి స్వర్ణాంధ్రప్రదేశ్ సాధనకు కలిసి పని చేయాలి. తాను నిరంతరం శ్రమను నమ్ముతాన్నాను. తానొక్కడి వల్లే అన్నీ సాధ్యం కావని 7 కోట్ల మంది ఆలోచించిశ్రమపడితే రాష్ట్రాన్ని ఆదర్శ వంతంగా తీర్చిదిద్దు కోవచ్చునని చంద్రబాబునాయుడు అన్నారు రాష్ట్రాన్ని స్వర్ణాంధ్రప్రదేశ్గా తీర్చి దిద్దడంలో మహిళలు విలక్షణమైన ప్రాత్రపోషించాలని రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు పిలుపువిచ్చారు. రాష్ట్రంలో ఎవరూ ఊహించని విధంగా మహిళలు అభివృద్ధి సాధిస్తున్నారు. తెలుగింటి అడపడుచులు బ్రహ్మాండంగా పని చేస్తున్నారు, రాష్ట్రంలో 1.8 లక్షల డ్వాక్రా గ్రూపుల ద్వారా 35 లక్షల మంది మహిళలు 260 కోట్లరూపాయలు పొదుపు చేశారని తెలిపారు. కుటుంబ సంక్షేమకార్యక్రమాలతో పాటు గ్రామాల అభివృద్ధికి కృషి చేస్తున్నారని తెలుగింటి ఉద్యమ స్ఫూర్తి చూస్తుంటే మీరు ఏదైనా సాధిస్తారని అనిపిస్తోందన్నారు. రాష్ట్రంలో మహిళలకు అన్ని రంగాల్లో ప్రాధాన్యం కల్పించి వారిని అభివృద్ధి పథంలోకి తీసుకొనిరావడానికి పలు సంక్షేమ కార్యక్రములు అమలు చేస్తున్నట్లు తెలిపారు. అన్యాయం జరిగిన మహిళలకు న్యాయం చేకూర్చేందుకు మహిళా కమిషన్ను ఏర్పాటు చేసినట్లు తెలిపారు. మహిళల్లో చైతన్యం

రావాలని కండక్టర్లు, డ్రైవర్లు, పోలీసు వంటి పోస్టుల్లో వీరిని నియమిస్తున్నట్లు చెప్పారు. మహిళలకు అన్యాయం జరిగితే యుద్ధభేరి మోగించి ముందుకు వెళ్ళాలి. ప్రజలకు పెత్తనం ఇస్తేకాని ఏ కార్యక్రమం కూడా జయప్రదం కాదనే దృష్టితో స్థానిక సంస్థలకు అధికారులను అప్పగించినట్లు తెలిపారు. రాష్ట్రంలో 13 లక్షల వ్యక్తిగత మరుగుదొడ్లనిర్మాణం కోసం రూ.330 కోట్లు వెచ్చించుచున్నట్లు తెలిపారు. ఇప్పుడు జరుగుతున్న అభివృద్ధి పనులు గత 50 సం!! రాల నుండి జరిగి ఉంటే రాష్ట్రంలో ఏ విధంగా అభివృద్ధి చెంది ఉండేదో ప్రజలుగమనించాలి. రైతులకు ఉపయోగపడే విధంగా శిక్షణ తరగతులు , భూసార పరిక్షా కేంద్రాలు ఏర్పాటు చేస్తున్నట్లు పేర్కొన్నారు. సమాజంలో అందర్ని ఆదుకోవాలని పేదరికాన్ని రూపుమాపాలనే ధ్యేయంతో రాష్ట్రప్రభుత్వం పని చేస్తుందన్నారు. పడుకున్న సమయం తప్ప మిగిలిన సమయమంతా నేను నిద్రపోను. అధికారులను నిద్రపోనివ్వను. ప్రజలును కూడా నిద్రపోనివ్వకుండా అభివృద్ధిలో భాగ్యస్వాములను చేస్తామన్నారు. జిల్లాలో 27 నూతన ఆర్టీసి బస్స్టేషన్లు నిర్మించనున్నారని తెలిపారు. రైతులంతా ఐక్యమత్యంగా అభివృద్ధి పనులు తనిఖీ చేసుకోవాలని చెప్పారు. సంక్షేమ కార్యక్రమాలతో పాటు అభివృద్ధి కార్యక్రమాలను మిళితం చేసి సమసమాజ స్థాపన వైపు పయనిస్తున్నట్లు తెలిపారు. రాత్రింబవళ్ళు కష్టపడి రాష్ట్రాన్ని స్వర్ణాంధ్రప్రదేశ్ తీర్చిదిద్దడానికి అహర్నిశలు కృషిచేస్తానని రాష్ట్రంలో జరుగుతున్న అభివృద్ధి పనులను చూసి విదేశీ సంస్థలు రుణాలు ఇస్తున్నాయని ముఖ్యమంత్రి చెప్పారు.

సంక్షోభంలో ఉన్న విద్యుత్‌రంగ వ్యవస్థను మెరుగుపరచడంతో

బాటు రాష్ట్ర అవసరాలకు అణుగుణంగా విద్యుత్‌ను ఉత్పత్తి చేయాలన్న ధ్యేయంతోనే విద్యుత్ సంస్కరణలకు శ్రీకారం చుట్టడమే గాక ప్రపంచ బ్యాంకు నుండి ఋణం తీసుకున్నట్లు రాష్ట్ర ప్రభుత్వం పునరుద్ఘాటించింది. రాష్ట్ర ప్రయోజనాలకు విఘాతం కలిగే ఎలాంటి షరతులకు ప్రభుత్వం అంగీకరించలేదు. 2007 నాటి విద్యుత్ అవసరాలను దృష్టిలో ఉంచుకోని సంస్కరణలకు శ్రీకారం చుట్టారు. ప్రాధమికంగా రాజకీయంగా దృష్టిలో ఉంచుకొని కొన్ని ఇబ్బందులు వచ్చినా ముందుకు వెళ్ళాలని ఇందులో స్పష్టం చేశారు. ప్రపంచ బ్యాంకునుండి మొత్తం 4.250 కోట్ల రూ!! వస్తుండగా దీనిలో మొదటి విడత రూ.892 కోట్లు అందుతుంది. ఈ రుణంపై సంవత్సరానికి 13.5%తక్కువగా కుండా వడ్డీ చెల్లిస్తారు. రుణాన్ని మూడేళ్ళ గ్రేస్ పీరియడ్‌తో కలిపి 15 సం!! రాల్లో తిరిగి చెల్లించాల్సి ఉంటుంది. ఈక్విటీ పై రిటర్న్ 2001లో 10% 2002 తర్వాత 16% తార్వాత 16% తక్కువగాకుండా ఉండాలి. విద్యుత్ సంస్కరణల్లో భాగంగా ఆంధ్రప్రదేశ్ ట్రాన్స్‌మిషన్ కార్పొరేషన్ జనరేషన్ ఏర్పాటు చేయటం అనుకున్న కార్యక్రమం ప్రకారం యధావిధిగా కొనసాగుతోంది. తదుపరి జిల్లా స్థాయిలో డిస్ట్రిబ్యూటరీ కంపెనీల ఏర్పాటు ప్రాసెస్‌ను ఈ ఏడాది ప్రారంభించి 2001-2003 లో పాక్షికంగా ప్రైవేటీకరణ చేయాలి. 2003-2005లో డిస్ట్రిబ్యూషన్ మొత్తాన్ని ప్రైవేటీకరించాలి. క్రాస్‌సబ్సిడీని క్రమంగా 130 బిలియన్ రూ!! ల నుంచి బిలియన్ రూపాయలకు తగ్గించాలి. చార్జీల పెరుగుదల 2000-2001 సం!!రాల్లో 15%చొప్పున ఆ తర్వాత 2 సం!!రలు

12%చొప్పున పెంచాలని సూచించారు. ప్రస్తుత ఖర్చుకు ఆదాయానికి 38% తేడా ఉందని ఏడాదికి 10% చార్జీలు పెంచినా ఇంకా 28% లోటు ఉంటుంది. దీనికి ద్రవ్యోల్బణాన్ని కలిపితే మళ్ళీ ఈ తేడా 38% ఉండే అవకాశం ఉంది. మహిళా సంఘాలకు డ్వాక్రా మహాలక్ష్మి పొదుపు సంఘాలకు మంజూరు గురించి వివరించారు. ఎస్సీ, ఎస్టీ, బి.సీలకు యితర కుల వృత్తుల వారికి యువకులకు వివిధ పథకాల రూపేణా యిచ్చిన ఆర్ధిక సాయం గురించి వెల్లడించారు. మహిళలకు అపురూపశక్తి సామర్ధ్యాలు ఉన్నాయి.కానీ వారు వాటిని వినియోగించుకునే చొరవ చూపడం లేదని ఇప్పటికిప్పుడే వారి శక్తి ప్రభుత్వ ప్రోత్సాహంతో బయట పడుతున్నదని అన్నారు.ఆంధ్రప్రదేశ్ మహిళలు ప్రపంచంలోకి మహిళంలో అధిక శక్తిమంతలమని ఇప్పడిప్పుడే రుజువు చేస్తున్నారని తెలిపారు.మహిళలను 33%కాలేజి సీట్లు రైతు బజార్ల ద్వారా ఉత్పత్తుల అమ్ముకునే అవకాశం కల్పించామన్నారు. మొదట రైతు బజార్ల గురించి విమర్శించిన వారి నోళ్లు ఇప్పుడుమూత పడ్డాయి. రైతు బజార్ల ద్వారా తాజా ఉత్పత్తుల వినియోగదారులకు అందుతున్నాయన్నారు. అన్ని రంగాల్లో మహిళలు అభివృద్ధికృషి చేయాలని ఇప్పుడు వధువులను వరుడు చూస్తున్నట్లుగా భవిష్యత్తులో వధువే వరుణ్ణి చూసే కాలం వస్తుందని సి.ఎం చెప్పారు. తమ సభ్యత్వం గ్యాస్ కనెక్షన్లు మహిళలకు అందజేయడానికి సిద్ధం కాగానే దానికి విమర్శలు వచ్చాయన్నారు.అమెరికా మాదిరిగా మన మహిళలు కూడా అనతి కాలంలోనే గ్యాస్ వినియోగానికి అలవాటు పడతారని మహిళలను గౌరవించే చోట మంచి జరుగుతుంది. ఎక్కడికి వెళ్ళినా

ప్రజలు తమకు బ్రహ్మరథం పడుతున్నారు. అభివృద్ధి పనులు అధికం కావడంతో ఆకలి జిల్లాలో వలసలు తగ్గాయని తెలిపారు. పని సంస్కృతిని ప్రవేశపెట్టి రాష్ట్రంలో ఒక సరికొత్త ప్రయోగం చేశాం. ఇది భారత దేశానికే ఆదర్శం ఇది ఫలప్రదం అయితే అందరూ ఆలోచిస్తారు. రాబోయే రోజుల్లో నూతన పంథాలో రాజకీయాలు ఉండటానికి ఆంధ్రప్రదేశ్ ప్రేరణ అవుతుంది. వివిధ రంగాల్లో తీసుకువచ్చిన సంస్కరణలు మార్పులు చేర్పులు సత్ఫలితాలుఇస్తున్నాయి. పారిశ్రామిక రంగానికి అనువైన వాతావరణాన్ని రాష్ట్రంలో నెలకొల్పగలిగాము. సబ్సిడీలకు తాను వ్యతిరేకం కాదని అభివృద్ధి సంక్షేమం సమతౌల్యంగా ఉండాలన్నదే తన అభిమతమని అన్నారు. మొదటి నుండి నా ఆలోచన ఒకటే ఏ వ్యక్తికైనా సంస్థకైనా విజన్ ఉండాలి. దీర్ఘకాలిక విధానాలు తాత్కాలిక సంక్షేమానికి మధ్య సమతుల్యం ఉండాలి. రాష్ట్రంలోని సహజ వనరులు మానవ వనరులను పూర్తి స్థాయిలో ఉపయోగించి అభివృద్ధి సాధించి పేదరికం నిర్మూలన దిశలో ప్రభుత్వాన్ని నడిపాము. నిర్దిష్ట విధానంలో ప్రణాళిక అమలు చేశాం. ఎన్నో సమస్యలు వచ్చాయి. వీటన్నింటినీ ఎదుర్కొంటు ప్రతి నిముషాన్ని నిర్మాణాత్మక కృషికి ఉపయోగించాము. కొత్త పని సంస్కృతిని ప్రవేశపెట్టి కష్టపడి రాష్ట్రాన్ని అభివృద్ధి చేయడానికి ప్రయత్నించాం. ఒక కొత్త ప్రయోగాన్ని తెలుగుదేశం ప్రభుత్వం నిర్వహించింది. ఎవరు పని చేస్తారో ఎవరు ప్రజలలో సన్నిహిత సంబంధాలు పెట్టుకుంటారో వారితోనే ప్రజలు ఉంటారన్న నమ్మకంతో కష్టపడ్డాం. ఫలితాలు ఇప్పుడు వస్తున్నాయి. భారతదేశానికి ఎ.పి.ఆదర్శం ఇది ఫలిస్తే ఆలోచిస్తారు. వచ్చే రోజుల్లో నూతన

పంథాలలో రాజకీయాలు నడపటానికి ఎ.పి. ప్రేరణ అవుతుంది. ముఖ్యమంత్రిగా పార్టీ అధ్యక్షుడిగా రెండు పదవులకు చాలా వరకు న్యాయం చేశాను. మొదట్లో పెనుసవాళ్లు ఎదురయ్యాయి. ప్రజలకు సన్నిహితంగా వెళ్ళడం ద్వారా ప్రభుత్వానికి కొత్త ఓరియండేషన్ యిచ్చాం. ఎన్నో కొత్త వ్యవస్థలను ఏర్పాటు చేసి అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాలు చేపట్టాం. ఇది పని చేసే ప్రభుత్వం అన్న నమ్మకాన్ని కల్గించగలిగాం. ప్రభుత్వంపై దృష్టికేంద్రీకరించిన సమయంలో కొంత కాలం పార్టీకి పూర్తి సమయంలో కేటాయించలేకపోయాం. ఆ తర్వాత ఏ పార్టీ నిర్వహించిన రీతిలో సంస్థాగత ఎన్నికలు, సభ్యత్వ కార్యక్రమం, ఎన్.టి.ఆర్. ట్రస్ట్ ఏర్పాటు, శిక్షణ కార్యక్రమాలు నిర్వహించాం. ప్రభుత్వాన్ని పార్టీని సమాంతరంగా నడుపగలిగాం. ఇరిగేషన్ రంగంలో ఆస్తుల ఏర్పాటే కాదు నిర్వహణ కూడా ముఖ్యం. నీటి వనరులను సమర్థవంతంగా ఉపయోగించుకోలేని పరిస్థితిని సరిచేసి అదనంగా 10 లక్షల ఏకరాలకు నీరిస్తారు. శివారు భూముల సమస్యలు చాలా వరకు తీరాయి. కాల్వలన్నింటిని బాగు చేశాం. పలు మధ్యతరహా ప్రాజెక్టులను పూర్తి చేస్తున్నాం. వెంగళరావు సి.ఎం.గా ఉన్నపుడు శంకుస్థాపన చేసిన వాటిని కూడా మేము పూర్తి చేస్తున్నాం. జూరాల, సోమశిల, తెలుగుగంగ, ఎస్.ల్.బి.సి., వెలుగొండ మొదలైన ప్రాజెక్టులకు నిధులు కేటాయిస్తున్నాం. తెలుగుగంగ, ఎస్.ఎల్.సి. తదితర భారీ ప్రాజెక్టుల సత్వర పూర్తికి చర్యలు తీసుకుంటున్నాం. ఒకప్పుడు గంగోపాధ్యాయ కమిటి ఇరిగేషన్ రంగంలో మిగులు సిబ్బంది ఉన్నట్లు గుర్తించింది. ఇప్పుడు ఉన్న సిబ్బంది చాలక కాంట్రాక్టుగా కూడా తీసుకుంటున్నాం. ఇరిగేషన్ రంగాన్ని, ఎప్పుడూ లేనంతగా అభివృద్ధి చేశాం. విద్యుత్‌కు ఎంతో

ప్రాధాన్యం యిచ్చాం. ఎండాకాలం కూడా రైతులకు విద్యుత్ సరఫరా చేసి నీళ్లు యివ్వగలిగాం. ఈ రంగంలో సంస్కరణల వల్ల ఎంతో ప్రయోజనం చేకూరేలా చేస్తున్నాం. వేంట్రాన్స్ ఫార్మర్లు, వందలాది సబ్స్టేషన్ల నిర్మాణం సాధ్యపడింది. ట్రాన్స్ మిషన్లో ప్రసార నష్టాలు తగ్గించడానికి చర్యలు చేపట్టాం. పి.ఎల్.ఎఫ్. కొత్త ప్లాంట్లు ఏర్పాటు తదితర అన్ని విధానాలతో యితర రాష్ట్రాలకన్నా యిక్కడే బాగా జరిగింది. విద్యుత్ సంస్థల సమర్థత పెంచి ట్రాన్స్మిషన్ డిస్ట్రిబ్యూషన్ నష్టాలను తగ్గించడం ద్వారా భారం లేకుండా చూడవచ్చు. పరిశ్రమ స్థాపనకు అనువైన వాతావరణాన్ని సృష్టించుకోగలిగాం. ప్రాథమిక సదుపాయాలను అభివృద్ధిచేస్తున్నాం. అయితే రెండు సార్లు లోక్ సభ ఎన్నికలు జరగడం. ఆర్థిక వ్యవస్థ దేశ వ్యాప్తంగా మందకొడిగా ఉండడం వంటి వాటి వల్ల ఆశించినంతగా పరిశ్రమలు రావడం లేదు. ఎక్కడైనా పారిశ్రామిక వేత్తలు ముందుకు వస్తే అది మన రాష్ట్రానికే వచ్చారు. పారిశ్రామిక వేత్తల ప్రాధాన్యత విషయంలో 22 వ స్థానం నుంచి రెండో స్థానానికి వచ్చాం. వచ్చే 5 యేళ్ళలో దీని ప్రభావం బాగా కన్పిస్తుంది. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను మెరుగు పర్చడంలో భాగంగా ఎ.పి.ఆర్.పి.ని తెచ్చాం. సహజ వనరులు, మానవ వనరులను సమీకృతం చేస్తూ దీర్ఘకాలిక, తాత్కాలిక లక్ష్యాలతో నిర్దిష్ట ప్రణాళికతో ముందుకు వెళ్తున్నాం. అందుకే విజన్ 2020 రూపొందించాం. ప్రభుత్వం వనరులు పెంచుకోవడం ద్వారా అభివృద్ధి పనులు సాగించాలి. ఇందుకు ప్రజలపై భారం వేయడమే మార్గం కాదు. సమర్థంగా పని చేయడం ద్వారా ఆర్థిక వనరులు పెంచుకోవచ్చు. సంస్కరణలు, పన్ను ఎగవేతల నిరోధం వంటి వాటి వల్ల వనరులు పెరుగుతాయి. డ్వాక్రా, సి.యం.ఇ.వై., ఆదరణ,

ముందడుగు, స్వయం ఉపాధి, వాటర్‌షెడ్లు అవకాశాలు కల్పించడం, నీటి పారుదల, అక్షరాస్యత, అభివృద్ధి మొదలైన వాటి ద్వారా కోటి ఉపాది అవకాశాలు కల్పించడం సాధ్యమే. 83% అక్షరాస్యత సాధనకు వచ్చే 2 యేళ్ళు, ప్రత్యేక ఉద్యమం చేపట్టదలిచాం. కుటుంబ సంక్షేమంపై గత నాలుగేళ్ళుగా చేసిన కృషి ఫలించలేదా? చాలా వరకు వ్యవస్థలను వికేంద్రీకరించాం. ప్రభుత్వం నిజాయితీగా ఉంది. ఎ.సి.బి. విజిలెన్స్ శాఖలను తగు అధికారాలు ఇచ్చాం. ఆయా పనుల పర్యవేక్షణకు ప్రజలకే అధికారం అప్పగించాం. టెండర్ల సంస్కరణల అమలుతో పాటు పలు రంగాలలో కౌన్సిలింగ్ చేపట్టి ప్రభుత్వ విచక్షణ అధికారాలను తొలగించాం. మున్ముందు లబ్ధిదారుల ఎంపిక కూడా ఇదే ప్రక్రియ అవలంభిస్తాం. ఒకప్పుడు యంత్రాంగం నిర్వీర్యంగా ఉండేది. నెగిటివ్ అలోచనతో ఉండేది. ప్రతిదీ ప్రజల భాగస్వామ్యంతో ప్రజల వద్దకు పాలన, శ్రమదానం, జన్మభూమి, సాగునీటి సంఘాలు మొదలైన వాటిని చేపట్టి ఫలప్రదం చేయడంతో అధికార యంత్రాంగంలో విశ్వాసం పెరిగింది. అందరిలో ఉత్సాహం, పుంజుకుంది. మళ్ళీ పాజిటివ్‌గా ఆలోచిస్తున్నారు. పని సంస్కృతికి అలవాటు పడుతున్నారు.

రాష్ట్రంలో తెలుగుదేశం ప్రభంజనమిస్తోంది. తెలుగుదేశం విజయంఖాయమని ముఖ్యమంత్రి తెలుగుదేశం నేత చంద్రబాబు నాయుడు అత్మ విశ్వాసం వ్యక్తం చేశారు. కాంగ్రెస్‌ను ఓడించడం కోసమే భారతీయ జనతా పార్టీత సీట్ల సర్దుబాటు చేసుకున్నామని చంద్రబాబు అన్నారు. అధ్యక్షుల ఎంపికను ఎంతో కసరత్తు జరిపారని, పూర్తి ప్రజాస్వామ్య పద్ధతిలో ఈ ప్రకియ నిర్వహించామని

చంద్రబాబు తెలిపారు. తిరుగుబాటు దార్లు తక్కువగానే ఉన్నారని, వారి వల్ల పార్టీకి పెద్దగా నష్టం జరగదని చంద్రబాబు నాయుడు చెప్పారు. వామపక్షాల పద్ధతిని చూసి జాలిపడుతున్నామని, వారు పూర్తిగా ఉనికిని కోల్పోతున్నారని కొత్తగా తావుఌ నేర పరిచితులెవ్వరికి టిక్కెట్లు యివ్వలేదని చంద్రబాబు నాయుడు అన్నారు. తెలుగుదేశం విజయావకాశాలు చాలా స్పష్టంగా ఉన్నాయి. తెలుగుదేశంకు అనుకూలంగా ప్రభంజనం వీస్తోంది. నాలుగున్నర ఏళ్ళుగా మా ప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి సంక్షేమ పథకాల పట్ల ప్రజలలో విశ్వాసం పెరిగింది. ఎక్కడ సమస్య ఉంటే అక్కడకల్లా మేము వెళ్ళాం. దాని ప్రభావం కన్పిస్తోంది. పార్టీ అభ్యర్థుల ఎంపికకు 25రోజుల పాటి రేయింబవళ్ళు కసరత్తు చేశాము. మూడు రకాల నివేదికలను తెప్పించుకున్నాం. 2,3 సర్వేలు చేయించాం. అందరితో చర్చించాం. కార్యకర్తల గురించి అభిప్రాయ సేకరణ చేశాము. వీటన్నింటిని విశ్లేషణ చేసుకుని ప్రాంతాలు, కులాలు, సామాజిక న్యాయ మహిళల ప్రాతినిధ్యం మొదలైన వాటిని పరిగణలోకి తీసుకుని టిక్కెట్లు ఇవ్వడం జరిగింది. సిట్టింగ్ ఎమ్మెల్యేల మార్పు అనుకున్న ప్రకారమే జరిగింది. ఎమ్మెల్యేలందరికి అప్రమత్తం చేస్తూ వచ్చాం. కార్యక్రమాలు యిచ్చాం. చాలా మంది మెరుగుపర్చుకన్నారు. వీటిన్నింటిని విశ్లేషించి గెలవగలుగుతున్నానుకున్న వారిలో చాలా మందికి టిక్కెట్లు ఇచ్చాం. కొన్ని సీట్లు బి.జె.పి.కి, మరికొన్ని సీట్లు మహిళలకు యివ్వాల్సి రావడంతో సమతుల్యం కోసం కొందరిని తప్పించాము. ఇందుకు ఎక్కడా సిఫారసుకాని, పక్షపాతం కాని లేవు. మెరిట్‌ను ఆధారంగా తీసుకున్నాం. చాలా వరకు ఫలప్రదమయ్యామనే భావిస్తున్నాం. కొన్ని సందర్భాలలో సామాజిక

న్యాయంకోసం, స్థానిక పరిస్థితుల రీత్యా బయటవారికి ఇవ్వాల్సి వచ్చింది. ఎవరైనా విషయాన్ని అర్థం చేసుకోకుండా మాట్లాడితే ఏమీ చేయలేం. ఆ యానియోజక వర్గాలోని ప్రత్యేక పరిస్థితులను చాలా మంది అర్థం చేసుకున్నారని భావిస్తున్నా స్థానికంగా ఇమేజి పోగొట్టుకున్న కొద్ది మందికి టిక్కెట్లు ఇవ్వలేదు. తెలుగుదేశం క్రమశిక్షణ పార్టీ, ఆశలు ఎక్కువ. సీట్లు తక్కువ, మున్ముందు ఎన్నో అవకాశాలు ఉంటాయి. తాత్కాలిక కోపంతో తిరుగుబాటు చేయడం సరికాదు. దీర్ఘకాలిక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకోవాలని అందర్ని కోరుతున్నా. ఈ నాలుగేళ్ళలో జరిగిన శాసన సభ స్థానాల ఉప ఎన్నికల్లో అత్యధికం మేమే గెలిచాం. 1998 యు.ఎఫ్. వైఫల్యం తదితర కారణాలు పని చేశాయి. ప్రస్తుతం ప్రజలు మాతోనే ఉన్నారు. అంతా పాజిటివ్ వాతావరణం ఉంది. ఈసారి తెలుగుదేశంకు అనుకూలంగా ఏకపక్ష ఎన్నికలు జరుగుతున్నాయని అన్ని సర్వేలు చెబుతున్నాయి. ఈ సారి వామ పక్షాలు తమ ఉనికిని కోల్పోతున్నాయి. మేము కొత్తగా నేరచరితులెవ్వరికి టిక్కెట్లు ఇవ్వలేదు. అభ్యర్థులతో ప్రమాణాలు చేయించడం ద్వారా ఎవ్వరూ నేరాలకు పాల్పడకుండా ఉండడానికి ప్రయత్నిస్తున్నాం. వచ్చే రోజుల్లో నేర రాజకియాలకు పోకుండా పాత వారిలో ఎవరైనా ఉన్నా వారిలో మార్పు రావాలని కోరుతున్నాము. అయితే రాష్ట్రంలో కొన్న ప్రత్యేక పరిస్థితులు ఉన్నాయి. వాటిని తాత్కాలికంగా ఎదుర్కోవడానికి నేర చరిత్ర ఉన్న కొందరు పాత వారికి ఇవ్వక తప్పలేదు. కాని మా అంతిమ లక్ష్యం పరిశుద్ధ రాజకీయాలే. ప్రజలు పార్టీని చూసి ఓట్లు వేస్తారు. ఆ పార్టీనాయకత్వం వహించే వారిపై ఆధారపడి ఉంటుంది. అమెరికా కాని ఏ దేశంలోనైనా ఇలానే ఉంటుంది. నాలుగున్నర ఏండ్లు కష్టపడి

ఎన్నో చేశాం. యిప్పుడు ఎన్నికలు వచ్చాయి. మంచి అభ్యర్థులనే మేం నిలబెట్టాం. అయినా ఎక్కడైనా ఒకటి, రెండు తప్పులు జరిగి ఉండవచ్చు, అలాంటి సందర్భాల్లో కేవలం అభ్యర్థులను మాత్రమే కాకా నన్ను కూడా చూసి ఓటు ఇవ్వాలని ప్రజలను కోరుతున్నా. ఆ తర్వాత సరిచేసుకోవడానికి వీలు ఉంటుంది. ఆతర్వాత అలా కాకాపోతే మొత్తానికే నష్టం వస్తుందని చెబుతున్నా. పార్టీలో నేనే సర్వస్వమన్నది సరికాదు. ఇంతకన్నా ప్రజాస్వామ్య బద్ధంగా ఎక్కడ జరుగుతుంది. ప్రతి అంశాన్ని పోలిట్‌బ్యూరోలో చర్చించాం. అందరిని విశ్వాసంలోకి తీసుకున్న తర్వాత నిర్ణయం చేస్తున్నాం. మాది సమిష్ఠ నిర్ణయం. అమలులో మాత్రం గట్టిగా ఉంటున్నా. ఒకసారి నిర్ణయం అయ్యాక ఎవరికి వారే ఉండరాదు. క్రమశిక్షణగా వ్యవహరించాలి. కార్యకర్తలతో మానసికంగా ఆ విధమైన మార్పు తెస్తున్నాం. చాలా వరకు ఫలితాలు వస్తున్నాయి. కేంద్రంలో వాజ్‌పేయి ప్రజాస్వామ్య కూటమిలో విభేదాలు తక్కువే, ప్రస్తుత రాజకీయాలలో ఇలాంటి చిన్న చిన్న సమస్యలు తప్పవని చంద్రబాబు అన్నారు. బి.జె.పి. విధానం ఏదోలా ఉన్నా తాము సెక్యులర్ విధానానికి కట్టుబడి ఉన్నామని స్పష్టం చేశారు.



ఏ పార్టీకి చెందని తటస్థుల మద్దతును ఆశిస్తూ తెలుగుదేశం పార్టీ తలపెట్టిన వినూత్న కార్యక్రమం "ప్రజాదీవెన" ఆకర్షణీయంగా ప్రారంభమైనది. వారం రోజుల పాటు రాష్ట్ర వ్యాప్తంగా ఈ కార్యక్రమం జరిగింది. తొలి రోజు కార్యక్రమానికి వేదిక అయిన సికింద్రాబాద్‌లోని హరిహర కళాభవన్ నిండిపోయి బయటకూడా

పెద్ద సంఖ్యలో ప్రజలు నిలబడి చివరి వరకూ ప్రసంగాలు విన్నారు. హాజరైన వారిలో మహిళలు పెద్ద సంఖ్యలో ఉన్నారు. తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు చంద్రబాబు నాయుడు, వివిధ రంగాల ప్రముఖులు వక్తలుగా హాజరైన ఈ కార్యక్రమం మంచి పాలన అందిస్తున్న తెలుగుదేశం ప్రభుత్వానికి ఎన్నికల్లో మళ్ళీ అవకాశం ఇవ్వాలని, మంచి ప్రభుత్వం రావాలని కోరుకునేవారు తమ ఓటు హక్కును తప్పని సరిగా వినియోగించుకొని మంచి ప్రతినిధులను ఎన్నుకోవాలని నిండు మనసుతో దీవించండి. వక్తలందరూ ఈ అంశాలకూ ప్రాధాన్యమిస్తూ ప్రసంగించారు. మేధావి వార్గాలకే వేదిక పరిమితం కాకూడదన్న ఉద్దేశ్యంతో రైల్వే పోర్టర్ల సంఘ అధ్యక్షుడు మహ్మద్ ఇబ్రహీంను కూడా పైకి పిలిచి కూర్చో బెట్టారు. కాళ్ళకు చెప్పులు కూడా లేకుండా సాదా సీదాగా వచ్చిన ఇబ్రహీం తనకు అవకాశం యిచ్చినపుడు క్లుప్తంగా మాట్లాడుతూ పోర్టర్లకు ఇళ్ళు, తమ పిల్లలకు విద్యా వసతులు లేవని, వాటిపై దృష్టికేంద్రీకరించాలని కోరారు. నగరంలోని సిక్కుల తరపున చంద్రబాబుకు కలపాణం, శాలువా బహుకరించిన హజూర్‌సింగ్ మాట్లాడుతూ ఇంధిరాగాంధీ హత్య సమయంలో సిక్కులపై దాడి జరగని రాష్ట్రం ఇదొక్కటే, దానికి తెలుగుదేశం ప్రభుత్వానికి తాము ఎంతో రుణపడి ఉంటామని, డైనమిక్‌గా పనిచస్తున్న చంద్రబాబు చాలాకాలం రాష్ట్రాన్ని పాలించాలన్న ఆకాంక్షను వ్యక్తం చేశారు. ఆర్చి బిషప్, ఎస్. అరుంప్ప సందేశాన్ని సభలో చంద్రబాబుకు అందజేశారు. డిసౌజా అనే చర్చి ఫాదర్ శిలువ రూపంలో తయారు చేసిన పుష్పగుచ్ఛాన్ని చంద్రబాబుకు అందజేశారు. వక్తలు తనపై కురిపించిన ప్రశంసలకు చంద్రబాబు సమాధానం యిస్తూ పార్టీలోకి కొత్తగా

వచ్చిన వారు బయటనుండి ఆశీర్వదించిన వారి అభిమానం నిలుపుకొనేలా పనిచేస్తానని చెప్పారు. ముఖ్యమంత్రిగా చంద్రబాబు నాయుడు పనితీరు తనకు నచ్చిందని, ఆయన కోసం మొదటి సారిగా ఈ సారి తెలుగుదేశం పార్టీకి ఓటు వేయాలని నిర్ణయించుకొన్నానని ప్రముఖ సినీనటుడు అక్కినేని నాగేశ్వరరావు తెలిపారు. హరిహర కళాభవన్‌లో తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో జరిగిన ప్రజాదీవెన సదస్సులో ఆయన పాల్గొని ప్రసంగించారు. కుటుంబ రీత్యా తాను కాంగ్రెస్ అభిమానినని, ఇప్పటికి ఓటు వేసిన 2 సార్లు తాను కాంగ్రెస్‌కే వేశాను. తాను ఇంత వరకూ టి.డి.పి.కి వేయలేదు. చంద్రబాబు చేపట్టిన పనులు తనను ఆయనకు దగ్గరకు చేశాయని అక్కినేని వివరించారు. జన్మభూమి గొప్ప కార్యమని, తన స్వగ్రామానికి 3 దశాబ్దాల తర్వాత వెళ్ళి సేవ చేయాడానికి చంద్రబాబు కారణమని, కొత్త ఆలోచనలు ఉండడంతో పాటు వాటిని ఆచరణలోకి తెచ్చే తెలివి తేటలు కూడా చంద్రబాబులో ఉన్నాయని అక్కినేని అన్నారు. ప్రజాదీవెన కార్యక్రమం ద్వారా టి.డి.పి. అడగకనే ఓట్లు అడుగుతున్నట్లు అనిపిస్తోంది. అడగడం వారి ధర్మమని అసలు ఓటు మానడం మాత్రం అధర్మమని, ఆ తప్పు తాను గతంలో చేశానని ఓటు వేయకుండా ఎవరూ ఉండవద్దని తాను విజ్ఞప్తి చేస్తున్నాని అక్కినేని చెప్పారు. రాజీవ్‌గాంధీ, చెన్నారెడ్డి, చంద్రబాబు నిద్రపోకుండా పనిచేసేవారని, అటువంటి నాయకులు అవసరమని అన్నారు. సి.బి.ఐ. మాజీ డైరెక్టర్ కె. విజయరామరావు ప్రసంగిస్తూ ముందుచూపు, విజ్ఞానం, కలిగిన నాయకుడు చంద్రబాబు ఆయనకు తెలుగుదేశం పార్టీకి సహకరించదల్చానని తెలిపారు. రాజకీయ బురదలోకి మీరెందుకు వెళ్తారని తనకు చాలామంది ఫోన్లు చేశారని,

అందరు దానికి భయపడి చేతులు కట్టుకొని కూర్చుంటే బురదను ఎవరూ ఎత్తిపారబొయ్యలేరని, గతంలో ఎన్నో బురదల్లో ఉన్నా అవేవీ తనకు అంటలేదని స్వచ్ఛందంగా ఉండగలిగానని అన్నారు జాతీయ మైనారిటీ కమిషన్ మాజీ చైర్మన్, రిటైర్డ్ న్యాయమూర్తి సర్దార్ ఆలీఖాన్ మాట్లాడుతూ రాష్ట్రంలో మైనారిటీల అభివృద్ధి కోసం చక్కటి చర్యలు తీసుకున్నారని చంద్రబాబు రాజ్యాంగబద్ధంగా పాలిస్తున్నారన్నది. న్యాయకోవిధునిగా తన అభిప్రాయమని ఆయన చెప్పారు. గ్లోబల్ ట్రస్ట్ బ్యాంక్ చైర్మన్ రమేష్ గెల్లి మాట్లాడుతూ మంచి పరిపాలన ఇచ్చే మంచి ప్రభుత్వం మనకు కావాలని అటువంటి ప్రభుత్వానికి మనం ఓటు వేయడమే కాకుండా పది మందికి చెప్పి వేయించుకోవాలని మంచిని సమర్థించే వ్యక్తిగా చంద్రబాబు గెలుపును తాను కాంక్షిస్తున్నానని అన్నారు. ఎన్టీఆర్ ఆంధ్రుల ఆత్మగౌరవాన్ని జెండాగా ఎగురవేస్తే చంద్రబాబు వారిలో ఆత్మ విశ్వాసాన్ని పొందుగొల్పారని రాజ్యసభ సభ్యుడు ప్రముఖ కవి డా. సి. నారాయణ రెడ్డి ప్రశంసించారు. ప్రతి కార్యక్రమంలో ప్రజలను భాగస్వాములును చేయాలన్న గాంధీ ధృక్పదాన్ని ఆధునికత మేళవించి అన్నా హజారేలాంటి వారి ప్రశంసలను కూడా ఆయన పొందగలిగారని సినారె అన్నారు. చంద్రబాబు రాజకీయ విప్లవ సారధిని దళితులు, బడుగువర్గాల అభివృద్ధికి నిధులు పెంచిన ఆయనకు తమ దీవెనలని ఎస్.పి. హక్కుల పరిరక్షణ రాష్ట్ర సమితి అధ్యక్షుడు బాలానాధం అన్నారు. ఫెన్నార్ స్టీల్స్ అధినేత ఉపేంద్ర రావు ప్రసింగిస్తూ ఓటువేయని వారికి జరిమానా వేయవలసిన అవసరం ఉందని వారి ఉదాశీలత వల్ల అనర్హులు ప్రతినిధులుగా ఎన్నిక కాగలుగుతున్నారని. ఈ పరిస్థితి మారాలన్నారు. ఉదరకోశ వైద్యుల

జాతీయ సంఘ ఉపాధ్యక్షుడు డా. నాగేశ్వర రెడ్డి ప్రసంగిస్తూ తాము విదేశాల్లో ఎక్కడికి వెళ్ళినా రాష్ట్రాభివృద్ధి గురించిన ప్రశంసలే వింటున్నామని, ప్రధానిగా అయ్యే అవకాశం వచ్చినా రాష్ట్రంలో ఉండిపోయిన చంద్రబాబు వంటి వ్యక్తి రాష్ట్రానికి కావాలన్నారు. సినీ రచయిత పరుచూరి గోపాలకృష్ణ ప్రసంగిస్తూ ఒక్క ఓటుతో కేంద్రంలో ప్రభుత్వం పడిపోయిందని, ప్రతివారూ తమ ఓటు విలువ గుర్తించి వేయాలని, కష్టపడి పనిచేసిన చంద్రబాబును ప్రజలు దీవించాలని కోరారు. సోషల్ వర్కర్ శాంతా సిన్హా టి.వి. ఆర్టిస్టుల సంఘాధ్యక్షుడు అచ్యుత్ ఫంక్షన్ హాళ్ళ యజమానుల రాష్ట్ర హోటళ్ల యజమానుల రాష్ట్ర సంఘం అధ్యక్షుడు హోజీసేర్, రైల్వే పోర్టర్ల సంఘం అధ్యక్షుడు మహ్మద్ ఇబ్రహీం, రిటైర్డ్ ఐ.ఎ.ఎస్. అధికారి బాబూరావు వర్మ, స్టాఫ్ నర్సుల సంఘ అధ్యక్షురాలు ఊర్మిళా భరద్వాజ్, మహిళా పారిశ్రామికవేత్తల సంఘ అధ్యక్షురాలు శ్రీమతి రమాదేవి చంద్రబాబుని దీవించారు.

అభ్యర్థుల ఎంపికలో ఒకటి రెండు చోట్ల పొరపాట్లు జరిగినా తనను చూసి తెలుగుదేశం పార్టీకి ఓట్లేయాలని చంద్రబాబు నాయుడు ప్రజలను అర్థించారు. ఎలాంటి అభ్యర్థులను ఎంపికచేయాలనే దానిపై పొలిట్ బ్యూరో 22 రోజులు కసరత్తు చేసి నిర్ణయం తీసుకొందని చెప్పారు. ఎక్కడైనా పొరపాట్లు దొర్లి ఉండవచ్చు. నన్ను చూసి ఓట్లేయమని మనస్ఫూర్తిగా ప్రార్థిస్తున్నాను. ప్రభుత్వం చేసిన పనులను, చేయబోయే పనులను పూసగుచ్చినట్లు వివరించారు. రాష్ట్రంలో సమస్య ఉంటే అక్కడికి మొదట వచ్చిన వ్యక్తిని తానే. మీ బలంతోనే అభివృద్ధి కార్యక్రమాలు చేయగలిగాను. ఈ ఎన్నికల్లో 13 రోజులు నా కోసం పని చేస్తే మీ భవిష్యత్తు కోసం మీ పిల్లల భవిష్యత్తు కోసం

రాత్రింబవళ్ళు శ్రమిస్తానన్నారు. పేదవాళ్ళే నా దేవుళ్ళు, అవసరమైతే ప్రాణాలు ఇవ్వడానికి కూడా వెనుకాడను. ఎన్టీఆర్ తొలిసారిగా తెలుగువారి ఆత్మగౌరవాన్ని ప్రపంచదేశాల్లో చాటారని ఆయన వారసులుగా ఆత్మవిశ్వాసంతో ముందుకు నడుస్తున్నాను. నిస్వార్థంగా సేవచేసే వారినే ఎంపిక చేశామన్నారు. నా ఆరోగ్యం, నా కుటుంబం కూడా మీ తరువాతే. తనకు తెలిసిందల్లా ప్రజలకు సేవ చేసి వారి అభిమానం పొందటమే. పేదరికాన్ని శాశ్వతంగా నిర్మూలించేందుకు కొన్ని వందల కోట్ల రూపాయలను వెచ్చించి ఒక ప్రత్యేక సంస్థను ఏర్పాటు చేయబోతున్నట్లు చంద్రబాబు నాయుడు వెల్లడించారు. రానున్న అయిదు సం.రాల్లో దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న 40 లక్షల కుటుంబాలకు ఆర్థిక పరిపుష్టి కల్పించేందుకు తాను ఏర్పాటు చేయదల్చుకున్న ప్రత్యేక సంస్థకృషి చేస్తుంది. రాజకీయాల కుళ్ళును కడిగి, విలువలు పెంచాడానికి మేధావి వర్గం ముందుకు వచ్చి ప్రజల్లో చైతన్యాన్ని కల్గించాలి. రాజకీయాలకు మేధావులకు దూరంగా ఉండడం వల్లనే ముఠానాయకులు రాజకీయాలను కలుషితం చేస్తున్నారన్నారు. డబ్బును వెదజల్లి ముఠాలు కట్టిగెలవాలని కొందరు నాయకులు ప్రయత్నిస్తున్నారన్నారు. అటువంటి వారిని సమాజం నుంచి వేరు చేయగలిగితే రాజకీయాలు పరిశుభ్రమవుతున్నాయన్నారు. రాజకీయాలంటే కొన్ని పార్టీలు, కొందరు రాజకీయ నాయకులే అభిప్రాయం పోవాలి. మేధావులు, తటస్థులు, మహిళలు, మైనారిటీలు అణగారిన వర్గాలు ముందుకు రావల్సిన అవసరముంది. పని చేసే వ్యక్తులకు ఓటు వేసి రాజకీయాల్లో నీతి నియమాలకు పెద్ద పీట వేయాలి. ప్రజాస్వామ్యంలో భాగస్వాములై ఎన్నికల్లో పాల్గొనండి. ఎజెండా మీరే నిర్ణయించి రాజకీయాలు మీరే నడపండి.

ఓ మంచి ఉద్దేశాన్ని ప్రజల్లోకి తీసుకువెళ్ళడానికి చర్చ ప్రారంభించండి. రాజకీయాలకు నిత్య జీవితానికి ఉన్న సంబంధాన్ని గుర్తించండి. ప్రజల్ని చైతన్య పరచండి. సింగపూర్ వంటి దేశాల్లో పెద్ద హోదాల్లో ఉన్న మేధావులు రాజకీయాల్లోకి వచ్చి దేశాన్ని ప్రగతి బాటన నడిపిస్తున్నారని తెలిపారు. వారిని ఆదర్శంగా తీసుకుని మనం స్వర్ణాంధ్ర ప్రదేశ్‌ను సాధించడానికి సహకరించవల్సిందిగా కోరారు. రాష్ట్రాన్ని ప్రగతి పథంలో నడిపించడానికి నాలుగున్నరేళ్ళుగా రాత్రింబవళ్ళు పని చేస్తున్నానని చెప్పారు. ఎన్నో అభివృద్ధి సంక్షేమ పథకాలు అమలు చేసి ఫలితాలు సాధిస్తున్నామన్నారు. రానున్న అయిదేళ్ళలో ఊహించని ప్రగతి రాష్ట్రంలో కన్పిస్తుందని చెప్పారు. జీతాలివ్వలేని స్థితిలో ఉన్న రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని ఈ 4 యేళ్లలో ఎంతగానో మెరుగుపరిచారని చెప్పారు. రాష్ట్రంలో పౌష్టికాహారాల కోసం కేంద్రం నుండి రూ. 1357 కోట్లు పొందాము. వాటర్ షెడ్ కార్యక్రమాల కోసం ఇంగ్లండ్ ప్రభుత్వం రూ.350 కోట్లు అందచేస్తోంది. అభివృద్ధి కార్యక్రమాల కోసం ఆర్థిక సాయం చేయడానికి జర్మనీ కూడా సంసిద్ధత వ్యక్తం చేసింది. జన్మభూమి సాధనతో విజన్ 2020 లక్ష్యాన్ని సాధించి స్వర్ణాంధ్రప్రదేశ్‌ను రూపొందించుకోగలిగామని చెప్పారు. సామాన్యుడికి మంచినీరు, గాలి, తిండి, ఉపాధి కల్పిస్తూ పేదరికంలేని సమాజాన్ని స్థాపించడానికి నిరంతరం కృషిచేస్తున్నానని చెప్పారు. మంచి వ్యక్తులకు ఓటు వేసి మంచి ప్రభుత్వానికి చేయూత యివ్వాలని కోరారు. మీ ఆశయాల సాధన కోసం నా పూర్తి చేయూత యివ్వాలి. మీ ఆశయాల సాధనకోసం నా పూర్తి శక్తిని వినియోగించుకోవడానికి సిద్ధంగా ఉన్నాను. నిండు మనస్సుతో ఆశీర్వదించండి. ఎన్నికల

ఖర్చును, ఎన్నికల కమీషన్ గానీ, కేంద్రప్రభుత్వం గానీ భరించాలని చంద్రబాబు పునరుద్ఘాటించారు. వీటిని పార్టీలు భరించడం వల్ల అవినీతి ఇష్టారాజ్యమవుతుందన్నారు. రూ. కోటి పార్టీఫండ్ కోరితే రూ. 100 కోట్లు ఖర్చు చేస్తుంది. వీటిని అరికట్టడానికి ఎన్నికల వ్యయాన్ని కమీషన్ భరించడమే ఉత్తమమని అభిప్రాయపడ్డారు. మళ్ళీ అధికారంలోకి వస్తే రాష్ట్రంలో దారిద్యరేఖకు దిగువున ఉన్న 40 లక్షల కుటుంబాల ఆర్థిక స్థితి మెరుగు పరచడానికి స్వతంత్ర్య ప్రతిపత్తి గల దారిద్య నిర్మూలన విభాగాన్ని ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తామని తెలుగుదేశం పార్టీ ప్రకటించింది. స్వయం సహాయక సంఘాలను శక్తివంతంచేసి కోటి మందికి ఉపాది కల్పిస్తాము. తెలుగుదేశం ఆశయాలు, లక్ష్యాలు గత నాలుగున్నర యేళ్ళలో తమ ప్రభుత్వం రాష్ట్రాభివృద్ధికి చేసిన కృషితో పాటు, మళ్ళీ అధికారంలోకి వస్తే సాధించదలచిన లక్ష్యాలను వివరించారు. దారిద్య నిర్మూలను ప్రత్యేక కార్యక్రమం క్రింద పేదరికంలో ఉన్న ప్రతి కుటుంబాన్ని గుర్తించి వారిని ఆర్థికంగా సామాజికంగా పైకి తేవడానికి శిక్షణ, ఆర్థిక సహాయం ఇస్తామని, ఇప్పుడున్న కొన్ని పథకాలను కలిపి, అదనంగా నిధులు సమీకరించి ఈ పథకాన్ని అమలు చేస్తామని చంద్రబాబు అన్నారు. సమాజంలోఅట్టడుగు వర్గాలు ఆర్థికంగానే గాక విద్య, ఆరోగ్య పరంగా కూడా మరింత మెరుగైన స్థితిలో ఉండేందుకు తమ ప్రభుత్వం బాధ్యత తీసుకుంటుందని, సామాజిక న్యాయం కూడా అందిస్తుందని చెప్పారు. 3 ఏళ్ళలో అర్హులైన నిరుపేదలందరికీ ఇళ్ళ స్థలాలు ఇస్తామని. ఏడాదికి 7 లక్షల చొప్పున 5 యేళ్ళలో 35 లక్షల పక్కా ఇళ్ళు నిర్మిస్తామని, 80 లక్షల మరుగుదొడ్లు నిర్మిస్తామని 200 జనాభా ఉన్న ప్రతి జనావాసానికి

రక్షిత మంచినీటి సదుపాయం పక్కా రహదారి కల్పిస్తామని తెలుగుదేశం ఎన్నికల ప్రణాళిక వాగ్దానం చేసింది. అర్హులైన పేదకుటుంబాలకు తెల్లకార్డులు యిచ్చి సబ్సిడీ బియ్యం పథకం కొనసాగిస్తామని, ప్రతి జనవాసానికి ఒక కిలోమీటరు పరిధిలో పాఠశాల ప్రతి అసెంబ్లీ నియోజక వర్గంలో బలహీన వర్గాలకు ఒక రెసిడెన్షియల్ పాఠశాల. 30 లక్షల మంది పిల్లలకు అంగన్ వాడీ సదుపాయాలు కల్పిస్తామని తెలిపింది. జన్మభూమిని నూతనోత్తేజంతో అమలు చేస్తాము. స్వయం సహాయ సంఘాలను బలోపేతం చేసి కోటి మందికి ఉపాది అవకాశాలను కల్పిస్తామని హామీ ఇచ్చారు. ఉపాది అవకాశాల పెంపునకు స్వయం ప్రతిపత్తితో కూడిన పేదరికం నిర్మూలన కమీషన్‌ను ఏర్పాటు చేసి నిధులిస్తామని వ్యవసాయ ఉత్పత్తులకు సరైన ధర లభించడంకోసం రూ.100 కోట్లతో ధరల స్థిరీకరణ నిధిని ఏర్పాటు చేస్తామని చంద్రబాబు నాయుడు అన్నారు. పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయి వరకు మహిళలకు ఉచిత విధ్య, 10 వ తరగతి వరకు బాలబాలికలకు ఉచిత పాఠ్య పుస్తకాలు, గ్రామీణ, పట్టణ ప్రాంత పేద మహిళలకు ఎల్. పి. జి గ్యాస్ కనెక్షన్లు, ప్రభుత్వ పరమైన సహాయాలన్నీ మహిళలకు అనేక వాగ్దానాలు చేశారు. చట్టసభల్లో మహిళలకు 3 వంతు రిజర్వేషన్ల సాధనకు పోరాడుతామని హామీ ఇచ్చారు. వచ్చే 5 ఏళ్ళలో 25 లక్షల ఎకరాలకు సాగునీరు అందించడం, వాటర్‌షెడ్ల ద్వారా మరో 50 లక్షల ఎకరాల్లో వ్యవసాయాభివృద్ధికి పదివేల మెగావాట్ల విద్యుదుత్పత్తి పెంపుదల, రాష్ట్రంలో అక్షరాస్యతను 53% నుండి 83% నకు పెంచడం, జనాభా పెరుగుదలను 1.3% నుండి 0.9% తగ్గించడానికి

కృషి చేస్తామని చెప్పారు. ప్రతి లక్ష జనాభాకు ఒక రైతు బజారు, జిల్లాకు ఒక వైద్య కళాశాల, పర్యావరణ సమతౌల్యానికి ఏటా 25 కోట్ల మొక్కలు నాటడం, పారిశ్రామికాభివృద్ధి రేటును 5.3 నుండి 9.7% వరకు పెంచడం. యువజనుల అభివృద్ధికి 5 ఏళ్ళలో రూ. 15 వందల కోట్లు వెచ్చించడం వంటి కార్యక్రమాన్ని చేపడతామని, కృష్ణా, గోదావరి నదీ జలాల వినియోగం, బలహీనవర్గాలు, మైనారిటీలు, మహిళల అభివృద్ధిలో రాష్ట్రాన్ని దేశంలో అగ్రగామిగా నిలపడం. రాష్ట్రాన్ని నాలెడ్జి సొసైటీగా తీర్చిదిద్దటం జరుగుతుందన్నారు.



దేశంలో జన్మించిన వారికే దేశంలోని అత్యున్నత పదవులు లభించేలా రాజ్యాంగ సవరణకు కృషి చేస్తామని తెలుగుదేశం పార్టీ హామీ యిచ్చింది. ఎన్నికలు తరచూ వచ్చే పరిస్థితిని నివారించడానికి పార్టీ ఫిరాయింపుల నిరోధానికి ప్రభుత్వమే పార్టీలకు ఎన్నికల నిధులు సమకూర్చి ధన ప్రాబల్యం తగ్గించడానికి అవసరమైన రాజకీయ సంస్కరణలు తేవడానికి కృషి చేస్తానని, సర్కారియం కమీషన్ సిఫార్సుల అమలుకు, స్థానిక సంస్థల పరిపుష్టికి కూడా హామీ యిచ్చింది. రౌడీయిజం, ముఠాకక్షలు అరికట్టి రాష్ట్రంలో ప్రతి ఒక్కరూ శాంతి భద్రతలతో జీవించడానికి కృషి చేస్తామని అన్ని ప్రభుత్వశాఖల్లో బదిలీలు కౌన్సిలింగ్ జరపడానికి ప్రభుత్వ పనితీరు మరింత పారదర్శకంగా ఉండడానికి అమలు చేయగలిగిన హామీలుగా చంద్రబాబునాయుడు చెప్పారు. ఆచరణాత్మకంగా దీనిని రూపొందించాం. మేం గత నాలుగున్నర ఏళ్ళుగా ఎలా పాలించామో

ప్రజలకు తెలుసు. మాపై వారికి విశ్వాసం ఉంది. మధ్య నిషేదం. సబ్సిడీ బియ్యంపై గతంలో హామీలు యిచ్చినా, తర్వాత వాటి అమలు సాధ్యాసాధ్యాలపై ప్రజల్లో విస్తృతంగా చర్చించి రాష్ట్ర ప్రయోజనాల దృష్టిలో నిర్ణయాభిప్రాయసేకరణ జరిగిందని చెప్పారు. ప్రతి అంగుళం నేల, ప్రతి బొట్టునీరును సద్వినియోగం చేస్తూ ప్రతి వ్యక్తి అభివృద్ధికి కృషి చేయడం తమలక్ష్యంగా ముఖ్యమంత్రి చెప్పారు.



రెండవ దశ వంట గ్యాస్ కనెక్షన్లు పట్టణ పేదలకు ఇస్తామని రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అన్నారు. అలాగే ఇంకా మిగిలిపోయిన గ్రామీణ పేదలకు కూడా 2వ విడతలో కనెక్షన్లు మంజూరు అవుతాయని చెప్పారు. పొయ్యిలతో బాధపడుతూ జబ్బుల పాలవుతున్న మహిళల కళ్ళలో కన్నీళ్లు రాకూడదని మొదటి విడతగా వందకోట్ల రూపాయలతో గ్రామీణ మహిళలకు 10 లక్షల వంటగ్యాస్ కనెక్షన్లు తమ ప్రభుత్వం మంజూరు చేసిందన్నారు. మొదట్లో ఇదంతా ఉత్తగ్యాస్ అని విమర్శించిన ప్రతిపక్షనాయకులు పథకం అమలు చేయడం ప్రారంభించగానే ఓర్వలేక అడ్డుపెట్టారని విమర్శించారు. మహిళల కోసం ప్రత్యేకంగా ప్రవేశపెట్టిన పథకాలు మిగిలిన అన్నీ పథకాలలో మహిళలకు ఇచ్చిన ప్రాధాన్యతను వివరించారు. ప్రత్యేక మహిళా పథకాలు కాక మిగిలిన అన్ని సంక్షేమ అభివృద్ధి పథకాల్లో 50% పైగా మహిళలకే వర్తింపజేస్తున్నామని చెప్పారు. తాను పరుషులకంటే మహిళలనే ఎక్కువగా నమ్మతానని తెలిపారు. అయితే ఇందుకు మగవారు బాధపడనక్కర లేదని, వారు

ఇంటి సభ్యులే కాబట్టి అందరూ కలసి సమిష్టి కృషితో అభివృద్ధి సాధించాలని కోరారు. మహిళలలో అపార శక్తి సామర్థ్యాలు దాగివున్నాయని వాటిని దేశాభివృద్ధికి ఉపయోగించుకోవాలని మహిళలను అన్ని రంగాల్లో చిన్న చూపు చూడటం వల్ల వారికి రూ.10 లు అవసరమైన ఇంట్లో అడిగి తీసుకోవల్సిన దుస్థితి పట్ల ఆవేదన వ్యక్తం చేశారు. అయితే మహిళా స్వయం సంవృద్ధికి డ్వాక్రా గ్రూపులను ఏర్పాటు చేయడం వల్ల లక్షలాది మంది లబ్ధిపొందుతున్నారు. ఈ నాలుగేళ్ళలోనే ఎన్నో వినూత్న అభివృద్ధి సంక్షేమ పథకాలు అమలు చేసి ఎంతో ప్రగతిని సాధించామన్నారు. గత 50 యేళ్ళ నుండి ఇదే తరహా ప్రభుత్వాలు ఉండే పరిస్థితి ఇలా ఉండేదా అని ప్రశ్నించారు. ప్రజల ఆశీస్సులు ఉండే ఎవరూ ఊహించలేని స్థాయిలో రాష్ట్రాన్ని అభివృద్ధి చేస్తానని కోరారు. ఆంధ్ర రాష్ట్రాన్ని ఆదర్శ రాష్ట్రంగా రూపొందించేంత వరకు నిద్రపోనని అన్నారు.

ఎన్నికల్లో ఉత్తుత్తి వాగ్దానాలతో ఓట్లు అర్థించే పార్టీల మాటల్ని నమ్మితే మోసపోతారని హెచ్చరించారు. తనకు ఒకే కోరిక ఉందనీ పేదల కంటనీరు తుడవగలిగతే చాలని అన్నారు. తమ ఓటు హక్కును తప్పని సరిగా వినియోగించడం ప్రతి పౌరుడి కర్తవ్యమని తెలిపారు.



రాష్ట్రంలో కావల్సినంతగా నిల్వలు ఉండడంతో ఇక ధరలు పెరిగే అవకాశం లేదని ముఖ్యమంత్రి చంద్రబాబు అన్నారు. ఈ ఏడాది దిగుబడులు కూడా రైతుబజార్లుపై అన్ని జిల్లాల అధికారులతో సమీక్ష జరిపారు. ఈ లోపు హోల్‌సేలర్లు ప్రభుత్వం స్టాకులను

మార్కెట్టులోనికి విడుదల చేయాలని ఆదేశమిచ్చినట్లు చెప్పారు. ప్రభుత్వం వద్ద నిత్యావసర సరుకుల నిల్వలు గణనీయంగా ఉన్నాయన్నారు. 10900 టన్నుల ఉల్లిపాయలను నిల్వచేయగా ఇప్పటి వరకు వెయ్యి టన్నుల ఉల్లిమాత్రమే వినియోగమయింది అని అన్నారు. కందిపప్పు 13242 టన్నులు జాగ్రత్త చేయగా, 1000 టన్నులు అమ్మకమైందన్నారు. చింతపండు 10వేల అరువందల టన్నులు, ఎండు మిర్చి 9600 టన్నులు సిద్ధంగా ఉంది. కావల్సినంత వంట నూనె అందుబాటులో ఉంది. యివి కాకుండా క్రొత్త నిల్వలు మార్కెట్టులోకి వచ్చే అవకాశం ఉందని. అందువల్ల ఇప్పుడున్న ధరల కంటే ఏమాత్రం అధికంగా ధర పలకవని అన్నారు. రాష్ట్రంలోని 3 జిల్లాల్లో వర్షాలు లేక పరిస్థితి అవినుకూలంగా ఉందని చిత్తూరు, అనంతపురం, కడప జిల్లాల్లో వర్షాభావ పరిస్థితి ఉందన్నారు. ఆయా ప్రాంతాల్లో నాట్లు పడుతున్నాయో లేదో అడిగి తెలుచుకున్నారు. అన్ని జిల్లాల్లో ఉల్లిపాయల అమ్మకాలు గురించి ప్రత్యేకంగా ఆరాతీశారు. కేజీకి అర్ధరూపాయి కంటే లాభం లేకుండా ఉల్లి విక్రయాలు జరగాలి. రాష్ట్రంలో అన్ని రైతు బజార్లను పూర్తి స్థాయిలో కంప్యూటర్లతో అనుసంధానం చేయనున్నట్లు చంద్రబాబు చెప్పారు. దీని వల్ల ప్రతి జిల్లాలోని రైతు బజార్ల వ్యత్యాసం లేకుండా ఉంటుంది. నన్ను బలపరచండి. అత్యధిక సీట్లలో గెలిపించడం ద్వారా ఎక్కువ శక్తి ఇస్తే ఎవరు తప్పులు చేసినా వారిని నియంత్రించడం ద్వారా మంచి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తాను. ఈ ఎన్నికల్లో తెలుగుదేశాన్ని గెలిపించడం ద్వారా మంచి బలాన్ని యిస్తే రాబోయే 4 యేళ్ళలో పేదరికమనేది ఉండదు. సర్వతోముఖాభివృద్ధి జరుగుతుంది. రాష్ట్రంలో ప్రభుత్వ వ్యతిరేక పవనాలు లేవు. ఉన్నదల్లా

అనుకూల ఓటుపై గట్టి నమ్మకం వ్యక్తపరిచారు. రాజకీయ సంస్కరణలు రావాలంటే మంచి వ్యక్తులు రాజకీయల్లోకి రావల్సిన ఆవశ్యకత ఉంది.



నకిలీ విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు,రైతులకు అమ్మాలన్న అలోచనే చేయవద్దని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఉత్పత్తిదారులు,డీలర్లను కోరారు. లాభాలు లేకుండా వ్యాపారం చేయడం లేదు. కాని, అత్యాశకు పోయి రైతులను దెబ్బతీస్తే అసలుకే మోసం వస్తుంది. ప్రస్తుత ఖరీఫ్ సీజన్‌లో నాణ్యమైన విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు సరఫరా చేసి అధికోత్పత్తి సాధించాలన్న ప్రభుత్వ లక్ష్యానికి తోడ్పడాలి. నకిలీ విత్తనాలు, క్రిమిసంహారక మందులు తయారు చేసే వారి నుంచి డీలర్లు కొనుగోలు చేయరాదు. అటువంటి వారిని దూరంగా ఉంచాలి. కంపెనీలు, డీలర్లు నుంచి తీసుకున్న విత్తనాలు మొలకెత్తక మందులు పని చేయక రైతులు ఎక్కడైనా నష్టపోతే రైతులను ఆదుకోవడానికి కంపెనీలు, డీలర్లు ముందుకు రావాలి.

ప్రభుత్వం కళ్ళుగప్పి రైతాంగాన్ని మోసపుచ్చేందుకు వ్యాపారులు ప్రయత్నిస్తుంటే వెంటనే అ సమాచారాన్ని 235405 ఫోన్‌నెంబరు ద్వారా హైద్రాబాద్‌లోని కంట్రోలు రూమ్‌కు తెలియజేయాలి. ఇది రాత్రింబవళ్ళు పని చేస్తుంది. కల్తీ ఎరువులు పురుగు మందులు, నకిలీ విత్తనాలకు సంబంధించిన సమాచారాన్ని ఎవరైనా ఫోన్‌చేసి అందించవచ్చును. విత్తనాలు, ఎరువులు పురుగు మందులు ఎవరి దగ్గర కొన్నా వెంటనే రసీదు తీసుకోవాలి.

అలాగే వ్యాపారులు కూడాతమ దగ్గరున్న సరుకును ఎవరి వద్దనుండి సమీకరించింది నిరూపించే ఆధారాలు కల్గి ఉండాలి. ఆదర్శ రైతులకు శిక్షణనివ్వాలని నిర్ణయించామని, దీనివల్ల వారు తమ గ్రామాలకు వెళ్ళి తోటి రైతులకు వ్యవసాయంలో మెళకువల గురించి చెప్పగలుగుతున్నారని చంద్రబాబునాయుడు అన్నారు.



ఏ రాష్ట్రంలోనూ లేని విధంగా రాష్ట్ర మహిళల్లో చైతన్యం వెల్లివిరుస్తుంది. మహిళలు చదువుకోవటం వల్ల కుటుంబమే కాకుండ గ్రామం, రాష్ట్రం కూడా ఎంతో అభివృద్ధి సాధిస్తోంది. మహిళలు చిన్నపుడు తల్లిదండ్రుల మీద పెళ్లి తరువాత భర్త మీద, వద్ధాప్యంలో కొడుకుల మీద ఆధారపడ వలసి వస్తుందని, ఇక పై అలాంటి అవసరం లేకుండా వారు సొంత కాళ్ళపై నిలబడేందుకు పొదుపుసంఘాలను ఏర్పాటు చేశాము. డ్వాక్రాగ్రూపుల ఏర్పాటుతోమహిళలు ఆర్థికంగా నిలబడి ఎన్నోఅవకాశాలను పొందే సమయం ఆసన్నమయింది. అరాచకాలు, వరకట్నదురాచారాలు పెరిగి పోయాయి. ఆడపడుచులపై అఘాయిత్యాలు రోజురోజుకు పెరిగి పోతున్నాయి. వీటిని మహిళలు సంఘటితంగా ఎదురుకోవలసి అవసరం ఉంది.

రాజకీయంగా ఆర్థికంగా మహిళాశక్తిని సద్వినియోగం చేసేందుకు రిజర్వేషన్ సౌకర్యం కల్పించాము. ఆర్టీసీ, పోలీసు, ఇతర ప్రభుత్వ ఉద్యోగాల్లోనూ 33% శాతం రిజర్వేషన్ ఇస్తున్నాము. రాష్ట్రాన్ని సర్వతోముఖాభివద్ధి చేసేందుకు రాజకీయాల్లోకి మహిళలు రావలసినఅవసరం ఉంది.

ప్రస్తుత దేశ రాజకీయాలను ప్రజలు అసహ్యించుకుంటున్నారని, ఈనేపథ్యంలో రాజకీయాలకే క్రొత్తనిర్వచనం చెప్పేదిశగా రాష్ట్రంలోని తెలుగుదేశం ప్రభుత్వం పనిచేస్తుందని ముఖ్యమంత్రి చెప్పారు. పని చేసేప్రభుత్వం కావాలనే దృక్పథాన్ని ప్రజల్లో పెంపొందిస్తానని తద్వార దేశ రాజకీయాల తీరు తెన్నులనే మార్చటం తమ ధ్యేయమని ముఖ్యమంత్రి అన్నారు. పని చేసే ప్రభుత్వమే తమకు కావలసిన ప్రజలు తప్ప కుండా అడిగే పరిస్థితి ఉత్పన్నమవుతుందని, అలాగే రైతుబజార్లు పెట్టికూరగాయల ధరలు, నిత్యావసరధరలను అదుపులో పెట్టమన్నారు. అలాగే ప్రత్తి కొనుగోలు కు మార్కెఫెడ్ సి.పి.వెలను రంగంలోకి దింపి మద్దతు ధర లభించేలా చూసామన్నారు. మిర్చి ధరలు కూడా దిగజారకుండా మార్కెఫెడ్ వంటి కొనుగోలు సంస్థలను మార్కెటులోకి దించుతున్నాము.

ఒంగోలు లోని పొగాకు రైతుసహకార సేవాసంస్థకు పది కోట్లు ఆర్థిక సహకారంచేశాము. ప్రకాశం జిల్లాలోసుబాబుల రైతుల బాధలను అర్థంచేసుకొని ధరలను నిర్ణయించి కంపెనీల చేత కొనుగోలు చేస్తున్నాము. కృష్ణా జిల్లాలో కాల్వల బాగుసేయుటకు రూ.70కోట్లు కేటాయించాము. సామాజికంగా, ఆరోగ్యపరంగామహిళలు ఎదుర్కొంటున్నసమస్యల పరిష్కారం కోసం మహిళ జన్మభూమి ప్రారంభించాము. ఈ పనులు పూర్తికావలంటేచాలాసమయం కావాలి. తనకు అంత వ్యవధి లేకున్న తాను ఆధికారులను అప్రమత్తం చేస్తున్నామని కమిటీల ద్వారప్రజలకే అధికారం అప్పగించామని, గ్రామంలో మంజూరు చేసిన పనులు

పూర్తికాలేదని గ్రామసభల్లో వివిధ కమిటీల అధ్యక్షులు చెప్పగాఇంత చిన్న పనులకు మీకే ఇంత వ్యవధి పడితే రాష్ట్రంలోఅభివ ద్ధిపనులకు తమకు ఎంత వ్యవధి కావాలో ఆలోచించాలని ముఖ్యమంత్రి అన్నారు. అయిన తమకు ఎండలు లేవు పండుగలు లేవు సంవత్సరం పొడవునా రోజుకి18గం.పైగా కష్టపడుతున్నాను అని చంద్రబాబునాయుడు అన్నారు. ప్రజలే యజమానులు నేనువారి ముఖ్యసేవకుడిని మాత్రమే.బి.జే.పి లోపొత్తుఅయినా మరేదైనా వారి అభీష్టం మేరకు నిర్ణయం ఉంటుంది.

నాప్రజలకు ముఖ్యసేవకుడిని అని చంద్రబాబునాయుడు అన్నారు.

రాజకీయం అనేది వ్యాపారం కాదని అయితే కొంతమంది నాయకులకది వ్యాపారంగా మారి పోయినదని ఎన్నికల్లోమహిళలకు మూడోవంతు టిక్కెట్లు ఇచ్చే విధంగాచట్టం రావాలని కోరుకుంటున్నామన్నారు. చట్టం వస్తే అన్ని పార్టీలు మహిళలకే మూడో వంతు టిక్కెట్లు ఇస్తాయి. కాబట్టి గెలుపు అవకాశాలు గురించి యోచించకుండా మూడో వంతు టిక్కెట్లు ఇవ్వడానికి వీలుంటుందన్నారు. మహిళ జన్మభుమికి లభిస్తున్న అనూహ్య స్పందనను చూస్తుంటే ఇక నిద్రా ఆహారాన్ని కూడా మాని పనిచేయానే పట్టుదల పెరుగుతుందని ప్రభుత్వం చేపట్టు తున్న వివిధ పథకాలను పనులను మధ్యలో ఆపకుండా కొనసాగించాలని ప్రజలు కోరుతున్నారని, వీటిని ఆడ్డుకొనేందుకు ప్రతి పక్షాలు చేస్తున్న యత్నాలను వారు గ్రహిస్తున్నారని ఈ పనుల్లో అంకిత భావంతో ఉంటుంది. మహిళలు అత్మాభిమానంతో ముందుకు

వస్తున్నారు. అవకాశం ఇస్తే తాము సాధించలేనిది ఏదిలేదని నిరుపిస్తున్నారు. డ్వాక్రా గ్రూపులు మహిళలు రాష్ట్ర వ్యాప్తంగా రూ.260 కోట్లు పొదుపుచేసి ఆంధ్రప్రదేశ్ మహిళలు ఒక ఉద్యమంగా ముందుకు సాగుతున్నారన్నారు.

తల్లిదండ్రులు ఆడపిల్లలను మగపిల్లలను సమానంగా చూడాలని మగపిల్లలే ఉద్ధరిస్తారనుకోవటం సరికాదు. రాష్ట్ర వ్యాప్తంగా 20 వేల డ్వాక్రా గ్రూపులకు రూ.50 కోట్లు ఇస్తున్నాము బాలికా సంరక్షణ పథకం క్రింద 55 వేల మందికి లబ్ది చేకూరుస్తూ రూ.25 కోట్లు బ్యాంకులల్లో డిపాజిట్లు వేయిస్తున్నారు.

## విద్యా వాలంటీర్లు

విద్యా వాలంటీర్ల వ్యవస్థను కొనసాగిస్తాము. ప్రతి పంచాయితీ పరిధిలో ఒక కిలోమీటరు దూరంలో 25 మంది పిల్లలు ఉంటే అక్కడ విద్యా వాలంటీరును నియమిస్తాము. ప్రస్తుతము కొన్ని వేల టీచరు పోస్టులను భర్తీ చేస్తున్నా వాలంటీర్లు సేవలను కూడా వినియోగించు కుంటామని ఇటీవల తొలగించిన వారందరిని కాకుండా బాగా పని చేసే వారిని టీచరు పోస్టులను అవసరమైన చోటు నియమిస్తామని సరిగా పనిచేయకపోతే తొలగింపు కార్యక్రమం కూడా ఉంటుందని ముఖ్యమంత్రి చెప్పారు. క్రాఫ్ట్, డ్రాయింగ్ పోస్టులు భర్తీ జరుగుతుందన్నారు. కోరింది తడువుగా ఉద్యోగాలు ఇవ్వలేము. తమ ప్రభుత్వం మాదిరిగా టీచరు పోస్టులను ఏ ప్రభుత్వం భర్తి చేయలేకపోయిందని 1.4 లక్షల మంది టీచర్లను భర్తి చేసామని కొద్ది నెలల్లో మరి కొన్ని వేల మందిని నియమిస్తున్నాము. పోలీసు కానిస్టేబుల్స్

నియామాకంతో పాటు అత్యవసరమని భావించిన ఏ ఉద్యోగులకు కూడా నియమాకుల ప్రక్రియ ఆపబోమని చంద్రబాబు నాయుడు చెప్పారు.



ఇ.ఎస్.ఐ స్కీములో లేని కార్మికులకు వైద్య సాయంగా 5 వేల రూ!! అందజేస్తామని చెప్పారు. దుకాణాల్లో పని చేసే 3 లక్షల మంది కార్మికులకు భీమాపథకం అమలు చేస్తామని అన్నారు. 5 లక్షల మంది బీడి కార్మికుల సంక్షేమం కోసం రాష్ట్ర కార్మిక సంక్షేమ నిధి నుంచి నిధులు మంజూరు చేయనున్నట్లు తెలిపారు. కార్మికుడు లేదా కార్మికురాలు ఒకే ఆడపిల్లని కల్గిఉండి కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్స చేయించుకుంటే బాలికల సంరక్షణ పథకం క్రింద 5 వేల రూ!! ఫిక్సిడ్ డిపాజిట్ స్కీముఅమలు చేస్తారు. జిల్లా స్థాయిల్లో పదోతరగతి పరీక్షల్లో ఎక్కువ మార్కులు తెచ్చుకున్న కార్మికుల పిల్లలకు 2 వేల రూ!!ల పారితోషికం అందిస్తారు. కార్మికుల పిల్లలకు పదోతరగతి తర్వాత కంప్యూటరు కోర్సుల్లో శిక్షణ ఇప్పిస్తామని తెలిపారు . బీడీ కార్మికులకు 40 వేల గృహాలు కూలీలకు 10 వేల గృహాలు నిర్మించి ఇస్తామన్నారు. 4 వేల మంది కార్మికుల పిల్లలకు అదనపు సాయం అందిస్తామని కార్మిక సంక్షేమానికి మరిన్ని పథకాలు అమలు చేయటానికి సిద్ధంగా ఉందని ముఖ్యమంత్రి అన్నారు.

ఈ రాష్ట్రంలో మొదటి కార్మికుణ్ణి నేనే అని ముఖ్యమంత్రి అన్నారు. ఉదయం 6.30 ని!! పనులు ప్రారంభించి రాత్రి 11 గంటస వరకు కొనసాగిస్తున్నానని అందుకే తాను కార్మికుడినని చెప్పగలుతున్నారు. ఆధునిక యుగంలో వస్తున్న మార్పులకు

అనుగుణంగా కార్మికులుకూడా మారాలి. చాలా మంది రెచ్చగొట్టే వారు ఉన్నారు. వారి మాటలకు మోసపోతే పరిశ్రమలు మూతపడి ఉపాధి పోయే ప్రమాదం ఉంది .



సముద్రంలో ప్రయాణించే నావికునికి తుఫాను సమయంలో దీపస్తంభం ఎలాంటి ఆధార మో ప్రస్తుతం యావత్ భారతి దేశానికి చంద్రబాబు అలాంటి వ్యక్తి అని ప్రముఖ సంఘ సేవకుడు అన్నా సాహెబ్ హజరే కితాబిచ్చారు. దేశమంతా ఇపుడు ఆంధ్ర వైపుచూస్తుందని అన్నారు. వాటర్ షెడ్లతో పాటు వివిధ కార్యక్రమాల అమల్లో రాష్ట్రం దేశానికే అదర్శంగా నిలుస్తోందన్నారు. ప్రజల భాగస్వామ్యంతో ముఖ్యమంత్రి చందబాబు రాష్ట్రాన్ని ఒక ఉద్యమంతా ముందుకు నడిపిస్తున్నారని ప్రశంసించారు. స్వాతంత్ర్యనంతరం ప్రభుత్వ కార్యక్రమాల్లో ప్రజలు అని విన్నాం కాని ఇక్కడ ప్రజల కార్యక్రమంలో ప్రభుత్వం అని వింటున్నామని చెప్పారు. వాటర్ షెడ్లవల్ల భూగర్భ ప్రజలకు జీవన భృతి కూడా లభిస్తుందని గ్రామాన్ని ఒక యూనిట్‌గా తీసుకొని నీటిని సంరక్షించుకోవాలి. గ్రామీణాభివృద్ధి జరిగినపుడే దేశం అభివృద్ధి చెందుతుందని వాటర్ షెడ్ల ఉద్యమం సామాజిక రుగ్మతుల నిర్మూలనకు దోహదపడాలి ప్రస్తుత వేగాన్ని ఇక ముందు కూడా కొనసాగిస్తూ రాష్ట్రం దేశానికే హెడ్ మాస్టరు లా తయారువుతుంది. నీటి ప్రాజెక్టులను గుడ్డిగా నమ్మకుండా ప్రత్యామ్నాయ మార్గాలను అన్వేషించాల్సిన తరుణం ఆసన్న మైంది. గ్రామాలకు తిరిగి వెళ్లండన్న గాంధీజి పిలుపును గమనం

లోకి తీసుకురావాలి. భూగర్భ జలాల అభివృద్ధి ద్వారా బంజరు భూములను సాగులోకి తీసుకు వచ్చేందుకు వాటర్ షెడ్ కమిటీల చేస్తున్న సే వలకు చరిత్ర ఎపుడు మరిచి పోదు.మనం 24 గం. కష్టపడుతున్న కొంత మంది బురద చల్లుతూనే ఉంటారు. రాళ్ళువేస్తూనే ఉంటారు. వీటికి కృంగి పోవద్దు. మనస్సాక్షిగా పని చేయండి. ముందుకు సాగండి .నేను కష్టాన్ని , కష్టపడే వ్యక్తులను నమ్ముతాను. నేను నిద్రపోను అధికారులను నిద్రపోనివ్వను. కొంత మంది కొన్ని సమయాల్లోనే ప్రజల ముందుకు వస్తారు. మీ వంట చేస్తాము మీపళ్ళు తోముతాము అంటారు. కాని ఎన్నికల తర్వాత మాత్రము అడ్రస్ ఉండరు. అని చంద్రబాబు నాయుడు అన్నారు.

రాయలసీమ తెలంగాణా ప్రాంతాలు ఎడారిగా మారకుండా ఉండటానికి వాటర్ షెడ్లు కారణమని రాయలసీమలోని ముఠాల ప్రభావం వాటర్ షెడ్లపై పడకుండా ఉండేందుకు వాటరు షెడ్ కమిటీలను మహిళలకే అప్పగిస్తామని చెప్పారు. వాటరు షెడ్లవల్ల భూగర్భ జలాలు వృద్ధి చెందడంతో పాటు త్రాగునీటి సమస్య కూడా, పరిష్కారం అవుతుంది. దేశ వ్యాప్తంగా ప్రస్తుతం 16,300 వాటర్ షెడ్లు పని చేస్తుంటే ఇందులో ఒక ఆంధ్ర ప్రదేశ్ లోనే 4,500 వరకు ఉన్నాయి.



పరిపాలనా యంత్రాంగాన్ని ప్రజల ముంగిళ్ళలోకి తీసుక వెళ్ళి అందులో వారి ప్రమేయం కల్పించి పారదర్శకమైన వ్యవస్థను నెలకొల్పాలని మన ముఖ్యమంత్రి శ్రీనారాచంద్రబాబు నాయుడు గారి బృహత్తర లక్ష్యంలో భాగంగా ప్రభుత్వం రెవిన్యూ సదస్సులకు

శ్రీకారం చుట్టుంది. అనేక సంవత్సరాలు అపఃష్కృతంగా ఉన్న భూా సవుస్యల పరిష్కారానికి ఈ సదస్సులు ఎంతో దోహదపడుతాయి. ప్రజలకు రైతులకు సంభందించిన సమస్యలపై అక్కడక్కడే చర్యలు తీసుకునేందుకు మండల రెవిన్యూ అధికారులు గ్రామాలలో తమతమ సిబ్బందితో విచ్చేసి రెవిన్యూ సమస్యలకు అధ్యక్షత వహిస్తారు. గ్రామపరిపాలనాధికారి (వి.ఎ.ఒ) పహని/ అడంగళ్ ఎంట్రీలను అనగా సర్వేనెంబరు దాని పరిధి పట్టాదారుని పేరు వంటి వాటిని రెవిన్యూ సదస్సులో సమర్పిస్తారు. రెవిన్యూ సదస్సు జరిగేవారం రోజుల పాటు వుంత్రులు కమీషనర్లు కార్యదర్శులు సీనియర్ అధికారులు జిల్లాలలో జరిగే కార్యక్రవూలలో పాల్గొని వాటిని పర్య వేక్షిస్తారు. రెవిన్యూ సదస్సులో జన్మభూమి కార్యక్రమాల్లో అందిన విజ్ఞాపనలతో పెండింగ్‌లో ఉన్న వాటి పరిష్కారం. ప్రభుత్వ వ్యవసాయోగ్యమైన భూమి మిగులు భూముల పంపిణీ.

ఇంటి స్థలాల పట్టాల పంపిణీ అర్హులైన వారి జాబితా తయారీ రెవిన్యూ సర్వే కార్డులతో మార్పుల నమోదు. ఇప్పటికే సిద్ధం చేసిన పట్టాదారు పాస్ పుస్తకాలు టైటిల్‌పీడ్స్ జారీ అటువంటి వాటి కోసం దరఖాస్తు చేసుకోగా పెండింగ్ లో ఉన్న వాటిపై విచారణలు.

చౌకధరలు దుకాణాల తనిఖీ, పట్టణ ప్రాంతాల్లో అర్హులైన ఆక్రమణల దారుల రెగ్యులరైజేషన్.

రైతులకు రైతుబజార్ కార్డుల పంపిణీ, సబ్‌డివిజన్ డిమార్కేషన్ కేసుల పరిష్కారం, సమగ్ర కుల సర్టిఫికేట్లు పంపిణీ,

ఇటీవల నీటి పారుదల పరిధిలోకి తీసుక వచ్చిన భూముల కోసం డిక్లరేషన్‌ల సేకరణ.

వివాదాస్పద రెవెన్యూ మరియు అటవీ భూములలో ఏర్పాటైనా జాయింట్ ఫారెస్టు మేనేజ్‌మెంట్ కమీటీలపై సమీక్ష. ఇనామ్ రద్దు చట్టం కింద పట్టాలు ఓఆర్ సిల జారీ ఎ.పి.ఎల్.జి (పి) చట్టం క్రింద ప్రభుత్వ భూముల పరిశీలన చర్యలు. నిర్వాసితుల ఆస్తులకు సంభవించిన విచారణ పరిష్కారం.



రాష్ట్రంలో ప్రతి నివాస ప్రాంతం మునిసిపల్ వార్డు శుభ్రంగా పచ్చదనంతో కళకళలాడాలని ప్రతి పౌరుడు ఆరోగ్య వంతమైన జీవితం గడపాలనే మహదాశయంతో 1998 సెప్టెంబర్ 10 వ తేదీన పచ్చదనం పరిశుభ్రత కార్యక్రమం ప్రారంభమైనది. ప్రతి 3వ శనివారం నాడు పచ్చదనం పరిశుభ్రత కార్యక్రమం నిర్వహిస్తారు. ఈ సందర్భముగా పారిశుధ్యం మంచినీరు, మొక్కలు నాటడం ఆరోగ్యంపై అవగాహన వంటి విషయాలకు ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. 1998 సంవత్సరం సెప్టెంబరు , అక్టోబర్, నవంబర్, డిసెంబర్ 1999 వ సంవత్సరం జనవరి , ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ మే నెలల్లో మొత్తం తొమ్మిది సార్లు ఈ ప్రచారోద్యమాన్ని నిర్వహించడం జరిగింది. ఈ సందర్భముగా గణనీయమైన విజయాలను సాధించాము.

10,525 కి.మీ దూరం మురుగు కాల్వలల్లో పూడిక తీసి వేశారు. 1,10,462 మెట్రిక్ టన్నుల చెత్తను తరలించారు.

13,353 మార్కెట్ పరిసరాలను పరిశుభ్రం చేసారు. 6.039 కభేళాలను పరిశుభ్రం చేసారు. 2,331 మున్సిపల్ పార్కులను శుభ్రపరిచారు. 3.57 లక్షల మొక్కలను నాటారు. 2.76 లక్షల త్రాగునీటి వనరులకు క్లోరినేట్ చేశారు.89.94 లక్షల విద్యార్థులకు ఉపాధ్యాయులు పాల్గొన్నారు. 6.409 సంస్థల్లో గ్రీన్ బ్రిగేడ్లు ఏర్పాటుఅయ్యాయి. 1.22 లక్షల ర్యాంకులలో 139.83 లక్షల మంది పోల్గొన్నారు.



పచ్చదనం పరిశుభ్రం ఆంధ్రప్రదేశ్ ప్రచారోద్యమంలో భాగంగా గ్రామీణ పట్టణ ప్రాంతాల్లో వ్యక్తి గత పారిశుధ్ద్య దొడ్ల నిర్మాణానికి ప్రాధాన్యం ఇస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ మౌళిక వనరుల అభివృద్ధి సంస్థ జిల్లాకు కోటిరూపాయలు చోప్పున నిధులు విడుదల చేసింది. వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణానికి మురికి కాలువల్లో పూడికలు తీసివేయడానికి చెత్త చెదరాన్ని తొలగించడానికి ఈ నిధులు ఖర్చు చేస్తారు. పెద్ద పెద్ద డ్రైన్‌లలో పూడికలు తీయడానికి చెత్త చెదారం తొలగించడానికి ప్రత్యేక కార్యక్రమాలు చేపడతారు. ఇందుకోసం ప్రజల నుంచి వాటా ధనం కోసం వత్తిడి చేయరు. అయితే స్థానిక సంస్థలు వద్ద అందుబాటులో వున్న మానవ వనరులు వాహనాలు ఇతర నిధులను పూర్తిగా వినియోగించు కోవటం జరుగుతుంది.

రాష్ట్రంలో అన్ని జిల్లాలలో (హైదరాబాదు మినహా) 12,77,606 వ్యక్తిగత పారిశుద్ధ్య మరుగు దొడ్ల నిర్మించాలని

గుర్తించారు. ఇందులో 96.95 కోట్ల ఖర్చుతో 5,13,071 వ్యక్తిగత పారిశుద్ధ్య మరుగుదొడ్ల నిర్మాణం జరిగింది. వీటికి గాను రూ 142.27 కోట్లు నిధులు విడుదల చేయబడింది.

8.43 లక్షల యూనిట్లు లబ్ది పొందారు. 42 లక్షల ప్రజలు మరుగు దొడ్లు ను నిర్మించాలకున్నారు. ఈ ఆర్థిక సంవత్సరంలో ఈ కార్యక్రమం ద్వారా 6.38 లక్షల ప్రజలు వారి వ్యక్తిగత పారిశుద్ధ్య మరుగు దొడ్లు నిర్మించుకున్నారు. ఈ సంవత్సరంలో సమాన పంపిణి ద్వారా అన్ని జిల్లాలలో 3 లక్షల యూనిట్ల నిర్మించాలన్నది లక్ష్యం అంతే కాక 1998-1999 లో చిన్న చిన్న పనులతో మిగిలి ఉన్న 3,37,812 పై చిలుకు పనులు సుమారు రూ127.56 లక్షలతో పూర్తి చేయడమే లక్ష్యం.

పై తెలిపిన కార్యక్రమం కాకుండా సమగ్ర గ్రామీణా పారిశుద్ధ్య పథకం తూ గోదావరి ప.గోదావరి కృష్ణ మరియు గుంటూరు జిల్లాలలో సూమారు 29.08 కోట్ల రూ నిధులు మంజూరయ్యాయి. ఇంకా 1.20 లక్షల పారిశుద్ధ్య యూనిట్ల కాక స్నానగదులు కాలువలు గ్రామీణ ప్రాంతాలలో పారిశుద్ధ్య వస్తువులు దుకాణాలు మరియు అవసరమైన వస్తువులు తయారి కేంద్రాలు కూడా ఏర్పాటు చేస్తారు.



త్రాగునీరు అందించడం ప్రభుత్వ ముఖ్య విధులలో ఒకటి. ఇందుకు గాను వివిధ సరఫరా సౌకర్యాల ద్వారా అందించేందుకు నిర్ణయించడమైనది. ఉదా. బోరు బావులు పైపుల ద్వారా

నీటిసరఫరా ఒక్కొక్క గ్రామానికి పైపుల ద్వారా నీటి సరఫరా మరియు సమీకృత Z.B.n పథకం ద్వారా గ్రామాల సముదాయానికి నీరు అందిస్తారు.



ప్రతి 250 నుండి 300ల ప్రజలకు గానుఒక పబ్లిక్ స్టాండ్ పోస్ట్‌కు కేటాయించారు. (షె.కు షె.తెగల వారి సంఖ్య విషయంలో మినహాయింపు ఉంటుంది.)

ప్రతి 250 మందికి ఒక బోర్ బావి త్రవ్వకం దానికి చేతి పంపు అమర్చటం జరుగుతుంది. షె.కు ,షె.తెగల వారి సంఖ్య విషయంలో మినహాయింపు ఉంటుంది.



ఈ పథకంలో నీటి సమృద్ధి కలిగిన ప్రదేశాన్ని గుర్తించి అందులో నుండి నీటిని గృహాలకు దగ్గరగా ఉండే రిజర్వాయర్లకు సరఫరా చేస్తారు. అక్కడి నుండి పబ్లిక్ స్టాండ్ పోస్ట్ (కుళాయిల ద్వారా ఇండ్లకు నీటిని అందిస్తారు.)



ఈ పథకంలో భూగర్భ జలాల నుండి గాని భూమిపై లభించే వనరుల నుండి గాని పూర్తిగా శుద్ధి నీటిని నిలువ చేసే ప్రదేశాలకు పంపుతారు. ఇచ్చట నీటిని క్లోరినేషన్ చేసి పూర్తి రక్షిత మంచి నీటిని ప్రజలకు అందిస్తారు.

బోరు బావులలోని కాలువ లలోని నదులలోని నీటిని రిజర్వాయర్లలోనికి పంపి అక్కడ పూర్తిగా క్లోరినేట్ చేసి ప్రజలకు అందిస్తారు. 18.10 లక్షల ప్రజలుంటే 11 11 నివాస ప్రదేశాలకు కేటాయించిన 58 ప్రాజెక్టులను 24 ప్రాజెక్టులుపూర్తి చేసారు. మిగిలిన ప్రాజెక్టులను ఈ సంవత్సరం పూర్తి చేస్తారు.

Unicef వారిచే శిక్షణ పొందిన సిబ్బంది తో ఏర్పాటైన మంచి నీటి ప్రయోగశాలలో మంచి నీటిని ఎప్పటికప్పుడు వాటి నాణ్యతలు తెలుసుకుంటారు.

500 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో 24 గం!!వైద్య సేవలు 100 ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలలో టెలిఫోన్లు వైర్‌లెస్ సెట్లు అద్దెకు లభించే వాహనాలు లాంటి సౌకర్యాలు కల్పించటం.

1999 లో 1009 కోత్త డాక్టర్ల నియామకం ఇంకా కొత్త డాక్టర్లు 3500 వైద్యతర సిబ్బంది 99 జూలై లోగా నియామకం, మందులు కు గాను సాలీన ఉన్న రూ 30కోట్ల నుండి రూ 60 కోట్లకు బడ్జెట్ పెంపుదల.

నిబంధనల ప్రకారం అన్ని ప్రముఖ ఆసుపత్రులకు ఆధునిక పరికరాల సరఫరా.

కొత్త వైద్యకళాశాలలు 5 దంత వైద్య కళాశాలలు ఏర్పాటు నర్సింగ్ మరియు వైద్యతర సిబ్బంది శిక్షణాలయాల సంఖ్యలో పెంపుదల.

వ్యాసెక్టమి ట్యూబెక్టమి, ఎమ్.టి.పి ఆరోగ్య క్యాంప్‌లు,

ఆపరేషన్లు తరువాత తీసుకోవలసిన జాగ్రత్తలు సంతాన సాఫల్య కేంద్రాల ఏర్పాటు.

మందు చల్లే కార్యక్రమాలు బ్యాక్టీరియాను నియంత్రంచే చర్యలు రాపిడే ఫీవర్ సర్వే మలేరియా సోకిన వారికి శ్రీఘ్రగతిన వైద్యసేవలు.

కఫము పరిక్ష ద్వారా ఎక్స్‌రే ద్వారా గుర్తించిన క్షయ కేసులకు చికిత్స 1998-99 లో 73,312 కేసులకు వైద్య చికిత్స.

చిన్న చిన్న కంటి రుగ్మతులకు చికిత్సలు వాపు పరీక్ష కంటి పూతల కేసులు గుర్తింపు క్యాంపులు ద్వారా వైద్యపరీక్షలు 1998-99 సం!!లో 3,43,680 ఆపరేషన్‌లు అందులో 14,512 కళ్ళద్దాల ఉచిత పంపిణీ.

కుష్టు రోగాన్ని గుర్తించిన రోగులకు మల్టీడ్రగ్ థేరపి ద్వారా చికిత్స.



తెలుగుదేశం పార్టీ రాష్ట్ర స్థాయి నాయకులందరికి కంప్యూటర్ వినియోగంలో శిక్షణ యివ్వాలని నిర్ణయించడంలో శిక్షణ తరగతులు ప్రారంభమయ్యాయి. రెండు బ్యాచ్‌లుగా 17 మందికి వారం రోజులుపాటు ఈ తర్ఫీదును యివ్వాలని భావించారు. శిక్షణ కోసం పార్టీనాయకుడు పి.ఎన్. వి.ప్రసాద్ ఆధ్వర్యంలో పది కంప్యూటర్లను ఏర్పాటు చేశారు. ప్రభుత్వ కార్యాలయాల్లో ఆకస్మిక తనిఖీలు చేసే చంద్రబాబు తాజాగా తన పార్టీ కార్యాలయంలో సైతం తనిఖీలును నిర్వహిస్తూపార్టీ

నాయకులను విస్మయం కల్గిస్తున్నారు. ఈ సమయంలో ఆయన టాయ్‌లెట్లను కూడా తనిఖీ చేస్తున్నారు. కార్యాలయంలో నాయకులకు కేటాయించిన వివిధ విభాగాలకు ఆయన వెళ్ళి అక్కడెవరైనా ఇతరులు ఉంటే ఎందుకొచ్చారంటు వారిని ప్రశ్నిస్తున్నారు. ఒక్కో విభాగంలోను రెండు కుర్చీలను మించి ఉండకూడదని ఎక్కువ కుర్చీలను వేసి యితరులను ఎందుకు ప్రోత్సాహిస్తున్నారంటూ కొందరు నాయకులను ప్రశ్నించారు. కార్యాలయంలో దిగువ అంతస్తునంతటిని యితరుల కోసం కేటాయించినందుకు నాయకులే కిందకు వెళ్ళి వారిని కలవాలని సూచించారు. తమ సమస్యలను ముఖ్యమంత్రికి నివేదించుకోవడానికి వివిధ ప్రాంతాల నుండి వచ్చే వ్యక్తుల కోసం కార్యాలయం ఆవరణలో ఒక షెడ్డును ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. ముఖ్యమంత్రి ఆషెడ్డులోనికి స్వయంగా వెళ్ళి ఆయా వ్యక్తులను కలుస్తారని పార్టీ వర్గాలు తెలిపాయి. హైటెక్ సదుపాయాలతో కార్పోరేట్ ఆఫీసు తరహాలో ఉన్న పార్టీ కార్యాలయానికిక సామాన్య కార్యకర్తలు ఇదివరకటి చొరవతో రాలేక పోతున్నారని ప్రజలలోమమేకం కావలసిన పార్టీకి ఇది కొంత ఇబ్బంది కలిగించే విషయమనే విమర్శలు తాజాగా వస్తున్నాయి. ఈ విమర్శలకు పార్టీ నాయకులు వివరణ ఇస్తూ ముఖ్యమంత్రి కేవలం తాను, ఇతర ముఖ్యులు ఉంటే మొదటి అంతస్తు పైకి మాత్రమే ఇతరులెవరూ రాకూడదని అన్నారని కార్యకర్తలు దిగువ అంతస్తులో ఉండొచ్చని చెప్పారు. కార్యక్రమాల రూపకల్పన పనుల్లో అంతరాయం కలుగకుండా చూపడం కోసమేముఖ్యమంత్రి ఈ నిబంధనలను పెట్టారన్నారు. మహిళలను అన్ని రంగాలల్లో

సమాన అభివృద్ధి అవకాశాలు కల్పించడానకి సామాజిక ఆర్థిక చైతన్యం కల్గించేందుకు పదోవిడత జన్మభూమి ని ప్రత్యేకించి మహిళల కోసం, నిర్దేశించినట్లు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తెలిపారు. సమాజంలో సగభాగమైన మహిళకు న్యాయం జరిగినపుడే సరైన అభివృద్ధి సాదించగలుగతాయని గ్రహించి ఈ జన్మభూమి కార్యక్రమంలో మహిళా చైతన్యం సామాజిక సమస్యలతో పాటు మహిళలకు సంబందించిన ప్రతి అంశాన్ని విస్తృతంగా ప్రచారం చేస్తున్నట్లు చెప్పారు. నాగరికత ఆధునికత ఎంత పెరిగినా గ్రామీణ ప్రాంతాల్లో మహిళలు సామాజిక సమస్యల సుడిలో ఆర్థిక ఇబ్బందుల్లో చిక్కుకుని ఉన్నారన్నారు. ఒక మహిళకు సంబంధించిన ఒక సమస్య పరిష్కరించడం కంటే మహిళలను సంబంధించిన అన్ని సమస్యలకు పరిష్కారం సాధించడానికి మహిళాలోకాన్ని గ్రామీణ స్థాయిలో సంఘటితం చేయాలి. వారిని చైతన్య వంతుల్ని చేసినపుడు తప్పక మంచి ఫలితాలు సాధించ గలుగుతాం. అందుకే గ్రామీణ స్థాయిలో మహిళలందురూ ఈ జన్మభూమి లో పాల్గొనేలా చర్యలు తీసుకున్నాం. వారం రోజులు పాటు మహిళ చైతన్యానికి జన్మభూమి నిర్వహించి నంత మాత్రాన సమస్యలు తీరిపోవు. ఈజన్మభూమి కార్యక్రమంలో తమ దృష్టికి వచ్చే ప్రతి అంశాన్ని గమనించి మహిళా సమస్యలు పరిష్కరించడానికి సమగ్ర కార్యాచరణ రూపొందిస్తాం అన్నారు. జన్మభూమి కార్యక్రమంలో మహిళలందురు పాల్గొంటే కొన్ని సామాజిక సమస్యలకు అక్కడిక్కడే సమాధానం లభ్యమవుతుంది. మహిళలను సమాన అవకాశాలు కల్పించే విషయంలో తమ ప్రభుత్వం ఇప్పటికి ఎన్నో

విధాల నిర్ణయాల తీసుక్ొని అమలు జరుపుతుంది. అయితే గ్రామాల్లో నిరక్ష్య రాస్యులైన మహిళల సమస్యలను తీసుకొని వాటిని పరిష్కరించడానికి మహిళా జన్మభూమి ఒక వెలుగుబాటుగా ఉపయోగపడుతుంది. సామాజిక ఆర్థిక రాజకీయ చైతన్యం మహిళల్లో కల్గించడానికి కల్పించడానికి ప్రభుత్వం చిత్తశుద్ధితో పని చేస్తుంది. రాజకీయ అవకాశలకై మహిళలను రిజర్వేషన్ కల్పించడానికి మొట్టమొదటిగా తామే డిమాండ్ చేసామని ఆతరువాత ఇతర రాజకీయ పార్టీలు దీన్ని ప్రచారాంశంగా చేపట్టామని గుర్తుచేసారు. డ్వాక్రా సంఘాల ద్వారా ఇప్పటికి గ్రామీణ మహిళ ఎంతో చైతన్య మైనది. రాష్ట్ర వ్యాప్తంగా 1.5 లక్షల డ్వాక్రా గ్రూప్‌లో 35 లక్షల మంది మహిళలు సభ్యులుగా ఏర్పాటు చేసుకున్నారు. మహిళా జన్మభూమిలో 50 వేల డ్వాక్రా గ్రూప్‌లను అదనంగా ఏర్పాటు చేస్తున్నాము. సామాజిక రుగ్మతులైన అత్యాచారాలు బాల్యవివాహాలు వరకట్న వేదింపులు వరకట్నచావులను రూపు మాపడానికి చట్టపరంగా ఉన్న అంశాలతో పాటు సామాజిక చైతన్యం కల్గించడానికి విస్తృత ప్రచారం చేపడుతున్నాం అదే విధంగా మహిళలు ఎదుర్కొంటున్న ఆరోగ్య సమస్యలుపై కూడా ప్రచారం నిర్వహిస్తున్నాం. ఎటువంటి వైద్య సహాయం లేకుండా నూటికి 65 శాతం మంది మహిళలు ఇండ్ల వద్దే పురుడు పోసుకుంటున్నారని అందువల్ల తల్లి బిడ్డల మరణాల సంఖ్య అధికమవుతుంది. ఆసుపత్రుల్లో పురుడు పోసుకునే విధంగా వారిని చైతన్య వంతుల్ని చేస్తాం ఇందుకై రాష్ట్ర వ్యాప్తంగా 400 ల ప్రసూతి కేంద్రాలు రాత్రింబవళ్ళు పని చేసే విధంగా చర్యలు తీసుకున్నారు. 20 వేల అంగన్ వాడి కేంద్రాలను క్రొత్తగా ఏర్పాటు చేస్తున్నాము ప్రభుత్వం

చేపడుతున్న కార్యక్రమాల్లో మహిళ భాగస్వామ్యం ఉండే విధంగా వారందరు పాలు పంచుకోవాలని కోరుతున్నామని ముఖ్యమంత్రి అన్నారు.

మహిళలు ఆత్మ గౌరవంతో జీవించాలంటే వారిలో ఆత్మవిశ్వాసం పెంపోదించాలి. ఇందుకై సామాజిక , రాజకీయ ఆర్థిక అవకాశాల పట్ల వారిలో స్పష్టమైన అవగాహన అవసరం పూర్తి అవగాహనలో మహిళలందరు సమిష్టిగా ముందుకు సాగాలి. అపుడే సులభంగా విజయాలు సాధిస్తారు. జిల్లా స్థాయిలో న్యాయ సహాయక సెల్ గైడెన్స్ సెల్‌లను నెలకొల్పుతున్నాము. బాలికల సంరక్షణకై ప్రభుత్వ లక్ష్యాన్ని సమగ్రంగా అమలు చేయడానికి మహిళలు సహకరించేలా జన్మభూమి ని ప్రచార వేదికగా వాడుకుంటున్నాం. మంది బాలికలకు చేకూరేవిధంగాబాలికా శిశు సంరక్షణ పథకానికి రూ.25కోట్లు కేటాయించాం. ఆర్థిక ప్రయోజనం చేకూర్చడానికి 48, వేల పొదుపు సంఘాలు ఏర్పాటు చేయడానికి మహిళా బ్యాంకులు ప్రారంభించడానికి ప్రభుత్వ పరంగా సహకారాన్ని అందజేస్తున్నాం పట్టణ ప్రాంత మహిళలను ప్రత్యేక కార్యక్రమాలు చేపడుతున్నాం. స్వయం సహాయ గ్రూపులు స్థానిక సంస్థల భాగస్వామ్యంతో జన్మభూమి మహిళలకు పూర్తి ప్రాతినిత్యమిచ్చే విధంగా కార్యక్రమాలు రూపొందించాము.

రాష్ట్రాభివృద్ధికోసం కేంద్రం నుంచి రూ.2,500 కోట్లు కేంద్ర నిధులు వచ్చాయన్నారు. వాజ్‌పేయి ప్రభుత్వంలో అంగన్ వాడిలో పిల్లలకు పౌష్టికాహారం ఉచిత విద్యకోసం రూ1,350 కోట్ల నిధులు వచ్చాయి. సింగరేణి బొగ్గు గనుల కంపెనీకి ఇటివల

రూ.650 కోట్ల కేంద్రనిధులు వచ్చాయని ముఖ్యమంత్రి అన్నారు.

వారానికి ఒక్కసారి కూడా భార్య పిల్లలతో కలిసి భోజనం చేసే అవకాశం తనకు రావడం లేదు. 24 గం!! రాష్ట్రాభివృద్ధి కోసం పేదల సమస్య పరిష్కారం కోసం కృషి చేస్తున్నాను. భగవంతుడు ఇచ్చిన శక్తినంత రాష్ట్రాభివృద్ధి కోసం వెచ్చిస్తానన్నారు. నేను ఏ ఒక్కరికి భయపడను. ఒక్క ప్రజలకు తప్ప ప్రజలే నాకు యజమానులు. నేను సేవకుణ్ని మాత్రమే దేవుడిచ్చిన మేధస్సు శక్తినంతా ప్రజల అభ్యున్నతికే వినియోగించాను. ప్రభుత్వం ప్రజల వద్ద ఉంది. అందుకే మీ వద్దకు వచ్చాను. నన్ను దీవించండి. అని రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రజలకు విజ్ఞప్తి చేశారు. నేను నిర్వహిస్తున్న అభివృద్ధి యజ్ఞం ఇకముందు కూడా నిరాటంకంగా కొనసాగేందుకు రాష్ట్ర భవిష్యత్తు మరింత భద్రంగా ఉంచేది తెలుగు దేశం పార్టీ ఇటీవల కాలంలో వివిధ వర్గాలకు ప్రకటిస్తున్న పథకాలు ఎన్నికల వరాలుకావని మొదటి నుండి తమ ప్రభుత్వం అనుసరిస్తున్నా విధానాలకు కొనసాగింపు మాత్రమేనని చంద్రబాబు స్పష్టంచేశారు. ఎక్కడన్నా తమ పార్టీవారు చిన్న తరహా చేసినా విశాల దృక్పథంతో వ్యవహరించి తన ప్రభుత్వ పని తీరు తన నాయకత్వాన్ని దృష్టిలో పెట్టుకొని ఓట్లేయాల్సిందిగా ప్రజలను కోరుతున్నానన్నారు.

తమ ప్రభుత్వం ఏర్పడినప్పటి నుంచి అనుసరిస్తున్న విధానాలకు కొనసాగింపే అభివృద్ధి సంక్షేమం మౌలిక సదుపాయాల కల్పనపై ప్రభుత్వం దృష్టి పెట్టి పని చేస్తుంది స్వయం సహాయ సంఘాలు యిప్పుడు ఏర్పడినవి కావు గత నాలుగేళ్లగా వివిధ

మార్గాల ద్వారా నిధుల సమీకరణ చేసి కార్యక్రమాల అమలు ఆరంభించాం. అవన్నీ ఇప్పుడు ఫలితాలు యిస్తున్నాయి. ముందడుగు చేయూత వంటి కార్యక్రమాలు కూడ గతంలో విధాన ప్రకటనలు యిచ్చాం. వీటిని ఎప్పటి కప్పుడు సమీక్షించుకొని సామాన్యమానవుడికి అందేలా కృషిచేస్తున్నాం. యిందుకు ముందు కూడా షాదీఖానాలు నిర్మించాం. మసీదులు బాగు చేయించాం. బడుగు వర్గాలకు సాయం చేయడంతో కులాలు మతాలు ప్రాంతాలు అన్న భావన తగదు. అలాగే మహిళల కోసం అమలు చేస్తున్న పథకాలు కూడా ఎన్నికల దృష్టిలోకాదు. సమాజంలో మహిళలు యింతకాలం అణచి వేతకు గురి అవుతున్నామన్న భావనలో ఉన్నారు. వారిని చైతన్య పరిచి వారి కాళ్ళ మీద వారు నిలబడేలా ఆత్మవిశ్వాసం పెంపొందించడం కోసమే ఈ ప్రయత్నాలన్ని మా ప్రభుత్వం అభివృద్ధికి సంక్షేమాన్ని సమతుల్యం చేస్తూ కార్య క్రమాలు జరుపుతుంది. సబ్సిడీలకు మేము వ్యతిరేఖం కాదు . వంట గ్యాస్ కనెక్షన్లు పేద మహిళలను ఎంతో మేలు చేస్తాయి. యిది ప్రజాకర్షక విదానం కాదు. .యిందులో ఆర్థిక ప్రగతి ఆంశాలు కూడా ఇమిడి ఉన్నాయి. వంట చెరుకు కోసం. చెట్లను నరికే ప్రక్రియ తగ్గుతుంది. మహిళలు వంట చెరకు తెచ్చుకోవడానికి అయ్యే సమయం తగ్గుతుంది. స్వయం ఉపాది ద్వారా ఆ టైమ్ లో కూడా మరి కొంత ఆదాయం సంపాదించుకోవచ్చు.గ్యాస్ సిలిండరు ధర 170 ఉంటుంది. జాగ్రత్తగా చూసుకుంటే ఒక్కో సిలిండరు మూడునెలలు వస్తుంది . అంటే నెలకు 60 రూ లోపే రెండురోజులు కూలీని దీనికి కేటాయించుకోవచ్చు. మా ప్రభుత్వ బడ్జెట్‌లో కంటే ఎక్కువ మొత్తాలనే ఖర్చు చేస్తుంది.

బడ్జెట్‌లో పెట్టిన ఏ కేటాయింపునకు తగ్గించ లేదు. అదనపు వనరుల సమీకరణ ద్వారా చేయగులుగుతున్నాం. రోడ్డు ప్రమాదాలు అధికంగా జరుగుతుంటే బడ్జెట్‌లో కేటాయించలేదని రోడ్డు రిపేరుకు నిధులు ఖర్చు చేయవద్దని అంటారా! పారిశుద్ధ్య నిర్వహణకు డబ్బు యివ్వద్దంటారా? అనేక సంవత్సరాలుగా ప్రభుత్వ ఆస్తులు నిర్వహణ సక్రమంగా లేదు. ప్రస్తుతం వాటన్నింటిని పరిగణలోనికి తీసుకొని వ్యవపరుస్తున్నాం. ఎక్కడా విధానాల మళ్ళింపు లేదు పారదర్శంగా చేస్తున్నాం.గతంలో ఇ.ఎ.ఎస్ నిధులు ఎలా వ్యయపరిచే వారో ఎవరికి తెలియదు. ఇపుడు ఆ నిధులు గురించి సైతం ప్రజలలో అవగాహన తెచ్చి ఏపనికి ఎంత ఖర్చు చేసింది. ప్రజలకు తెలిసేలా చూస్తున్నాం.

రాష్ట్రంలో సంపదను వృద్ధి పరుస్తున్నాం. ఆర్థిక వ్యవస్థను నిర్మిస్తున్నాము. ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితి బాగుందని పరిశ్రమలు వచ్చే వాతావరణం ఏర్పడింది. వ్యవసాయ ఉత్పత్తిపెరిగింది . డ్వాక్రా ఆదరణ సి.ఎం.ఇ.వై తదితర స్కీములు ద్వారా స్వయం ఉపాది ఏర్పడుతుంది. ఉపాధి అంటే ప్రభుత్వ ఉద్యోగాలు ఇవ్వడం వరకు ప్రభుత్వం లో పది లక్షల ఉద్యోగాలు ఇచ్చారు. ఇకపై అనవసరపు రిక్రూట్‌మెంట్ ఉండదు. గతంలో రాజకీయ స్వార్థం కోసం ఎక్కడ బడితే అక్కడ ప్రభుత్వ ఉద్యోగాలు ఇప్పించి ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థను దెబ్బ తీసారు. అందువల్లనే1 కొన్ని చోట్ల మిగులు మరికొన్ని చోట్ల సిబ్బంది. కొరత ఏర్పడ్డాయి. రాష్ట్రంలో అటు అభివృద్ధి ఇటు ఉపాధి మెరుగైతే ప్రభుత్వ ఆదాయం సహజం గానే పెరుగుతుంది. అందువల్ల అదనపు భారం ఉండాల్సిన అవసరం ఉండదు.

ప్రజలకు మంచి పని చేసేటప్పుడు కూడా కొందరు విమర్శలు చేయడం బాధాకరం టెలి కాన్ఫరెన్స్ వల్ల సమన్వయం పెరిగి పనులు వేగంగా జరగటానిక అవకాశం కలుగుతుంది. మంత్రులు సెక్రటరీలు కలెక్టర్లు శాఖాది పతులు అంతా ఇందులో పాల్గొనడం వల్ల జవాబు దారితనం పెరిగి ప్రజలలో తమ పట్ల చులకన ఏర్పడుతుందే. మోనన్న భయంతో అందరూ బాగా పని చేస్తున్నారు. ప్రతి వారం ఆయా శాఖలకు సంబందించి ప్రగతి సమీక్షించి నిర్ణయాలు తీసుకోగల్గుతున్నాం.

వెంగళరావు కాలం నాడు శంకు స్థాపన చేసిన ప్రాజెక్టులను మేము పూర్తి చేసాం. నీటి పారుదల ప్రాజెక్టులను 20 వేల కోట్లు ఖర్చు చేయాలి. అంతా ఒక్క సారే తెచ్చినా, ఖర్చుచేసే పద్ధతి ఉండాలి. ఈ ఏడాది నీటి వనరుల నిర్వహణకు 500 కోట్లు ఇస్తే వాటినే వ్యయుపరచే పరిస్థితి లేదు. ప్రతి రూపాయి సద్వినియోగం కావాలన్నది మాలక్ష్యం.

రాష్ట్రంలో తెలుగుదేశం పట్ల ప్రజలలో పూర్తి విశ్వాసం నెలకొంది. పని చేసే ప్రభుత్వంగా గుర్తింపు పొందింది. ప్రజా సమస్యలకు స్పందించే ప్రభుత్వమన్న పేరు తెచ్చుకుంది. వీరి చేతిలోనే అధికారం ఉంటే రాష్ట్ర భవిష్యత్తు బాగుటుందని అందరు అనుకుంటున్నారు. గత నాలుగేళ్ళుగా మా పని తీరు ప్రజా సమస్యలపై అవగాహన పెంచుకున్న తీరు పాలన సంస్కరణలు చేపట్టినవైనం ఇందుకు దోహదం చేశాయి. ఫలితాలు రావడం ఆరంభం అయింది. 14 వేల కోట్లు రూపాయలు వనరులు రాష్ట్రానికి వస్తున్నాయి. అక్కడక్కడ కొన్ని సమస్యలు

ఉండవచ్చు కాని స్థానిక సమస్యలను దృష్టిలో పెట్టుకొని వ్యవహరిస్తే రాష్ట్రానికి నష్టం కలుగుతుంది. ప్రభుత్వ పనితీరు నాయకుడిగా నాపని తీరు చూసి సహకారం అందించాలి మా ఎమ్మెల్యేలు నాయకులు చాలామంది నిత్యం ప్రజల్లోకివెళ్ళి పని చేస్తున్నారు. ఎక్కడకన్నా ఒకటి అరాఇబ్బంది ఉన్నా సరి చేసు కోవచ్చు. అయినా ఎక్కడైనా కొద్ది మంది సరిగా చేయలేకపోతె అపుడు ఆలోచించాలి. ఇవన్నీ తగు సమయంలోనే నిర్ణయం అవుతాయి. నాకార్యక్రమాలు ప్రజా ఆమోదం లబించింది. ఏవ్యక్తిపైనా వ్యక్తి గతంగా నేను మాట్లాడను కొంత మంది బురద జల్లడమే కార్యక్రమం, నీచాతి నీచమైన ఉచ్చరించడానికి వీల్లేని బాష వాడటం అలవాటు, అది వారి బలహీనత, నైజం, రాజకీయాలలో హుందాగా ఉండాలి. ఎన్నో పారదర్శక విధానాల ద్వారా ప్రభుత్వాన్ని నడుపుతున్నాం.

ప్రజా స్పందనే నాకు శక్తి స్ఫూర్తి మరింత ఉత్సాహంగా రాష్ట్ర కోసం పని చేయడానికి అదే ఉపకరిస్తుంది. 1982 లో ఎన్.టి. ఆర్. తెలుగుదేశం పార్టీ స్థాపించినపుడు లెఫ్ట్ పార్టీలు వంద సీట్లు అడిగి నాడని అందుకు అంగీకరించకి పోతే ఒంటరిగా పోటి చేసిన దేశం కు 202 సీట్లు వచ్చాయి. రాష్ట్రంలో నారో బ్రిడ్జిల మరమత్తులన విస్తరణ కు రూ.80 కోట్లు నిధులు అవసరమవుతాయని వీటి విడుదలగురించి ప్రభుత్వం పరిశీలిస్తోంది. మార్కెట్ కమీటీ నిధులు తో వేసే రహదారులతో ఎటువంటి అవకతవకలు లేకుండా కలెక్టర్లు జాగ్రత్త వహించాలి నాణ్యత విషయంలో రాజి పడవద్దని ముఖ్యమంత్రి అన్నారు. ఆర్.అండ్.బి రహదారుల ప్రక్కన పిచ్చి చెట్లు బాగాపెరిగి రహదారి కనబడకుండా పోయిన చోట రహదారి

బాగా కనబడే విధంగా చెట్లను తొలగించాలి. వీటి కారణంగా ప్రమాదాలు జరుగుతున్నాయి.

మనుష్యులతో తొలగించేందుకు వీలులేని చెట్లను పోక్లెయిన్ల ద్వారా తొలగించాలి. రహదారి పై ఉన్న బ్రిడ్జిలు, కాజ్‌వేలకు వాటి ఉనికి తెలిసె విధంగా రంగులు వేసి, గుర్తులు ఏర్పాటు చేయాలి, రోడ్డు మిద చెట్లు ఎపుడు పడినా వాటిని వెంటనే తొలగించేందుకు చర్యలు తీసుకోవాలి. ప్రమాదాలు జరగకుండా ముందు జాగ్రత్త చర్యలు చేపట్టాలి. జిల్లా కలెక్టరు, ఎస్పీ, ఆర్. అండ్- బి, ఎస్. ఇ., పంచాయితీరాజ్ ఎస్. ఇలు కలసి ప్రమాదనివారణకు తగిన చర్యలను చేపట్టాలి. ముఖ్యముగా పంచాయితీ రహదారుల పై బస్సులు తిరిగే విధంగా ఆశాఖ ఎప్పటి కప్పుడు మరమ్మత్తులు చేపట్టాలని ముఖ్యమంత్రి అన్నారు. ముఖ్యమంత్రుల సమావేశంలో చంద్రబాబు నాయుడు మాట్లాడుతూ చర్చలో పాల్గొని వాగ్ధాటితో మెప్పు పొందడానికి ప్రయత్నించాల్సిన సమయం కాదిది. భారతీయమలందరు ఏకమై దేశగౌరవమే తమకు అత్యంత ప్రధానమని చేతల ద్వారా తెలియడజెయాలి. చొరబాటుదారులను తక్షణం తరిమివేయాలి. మిగిలిన విషయాలన్నింటికీ ఆ తర్వాత స్థానమేనని చాటి చెప్పాలి. భారతదేశం నియంత్రణ రేఖను ధాట కూడదని, అణ్వస్త్రాలు ప్రయెాగించే విషయాన్ని పరిశీలించేటపుడు సంయమనం పాటించాలి. భాద్యతాయుతంగా వ్యవహరించాలి. తెలివి తక్కువ ప్రకటనలు చేయల్సిన సమయం ఇది కాదు. నియంత్రణ రేఖ వద్ద చొరబాట్లకు ముందు ఉన్న పరిస్థితి ఏర్పాడ్డాక మొత్తం సంఘటన పై వివరణవ్వాలని కేంద్రాన్ని

ముఖ్యమంత్రి చంద్రబాబు ఆదేశించారు. సైనికులకు సంఘీభావం తెలిపేందుకు ఆంధ్రప్రదేశ్ లో ప్రభుత్వం నిర్వహించిన ర్యాలికి ప్రజలు పూర్తి మద్దతును ఇచ్చారని కార్గిల్ పోరులో ప్రాణాలు కోల్పోయిన మేజరు పద్మపాణి ఆచార్య తల్లిదండ్రులు తనతో అన్న మాటలను ముఖ్యమంత్రి ప్రస్తావించారు. తమతో పాటు గర్వించమన్నారే కాని తమ దుఃఖాన్ని పంచుకోమ్మని కోరలేదు అన్నారు. శత్రువును తరిమి కొట్టడంలో ప్రధానికి బాసటగా నిలవాలని ముఖ్యమంత్రులను చంద్రబాబు అభ్యర్థించారు. దౌత్యపరంగా విజయవంతమైన చర్యలు చేపట్టినందుకు ప్రధాని వాజ్‌పేయిని వీరోచితంగా పోరాడుతూ విజయానికి చేరువైన సాయుధ దళాలను కొనియాడారు. ప్రస్తుత సంక్షోభంలో వాజ్‌పేయి అత్యంత చాకచక్యంగా, సిసలైన రాజనీతిజ్ఞుడిలా బాధ్యతాయుతంగా వ్యవహరిస్తూ దేశాన్ని ముందుకు నడిపిస్తున్నారని అన్నారు.

గ్రామీణ ప్రాంతాల లోని పేద మహిళలకు పది లక్షల వంట గ్యాస్ కనెక్షన్లు ఇచ్చి వారి జీవితాలలో కొత్త కాంతులు నింపాలని రాష్ట్రప్రభుత్వం సంకల్పించింది. రోజూ పోయ్యి రాజుకోవడానికి కట్టెలు, పుల్లలు ఏరుకొనే కష్టాల నుండి ఆ మహిళలకు విముక్తి కల్పించి, పొగసెగల అనారోగ్యం నుండి గ్రామిణ మహిళలను కాపాడాలనే మహత్తర ఆశయంతో ప్రభుత్వం కోట్ల రూపాయల అంచనాతో ఈ వినూత్న పధకాన్ని ప్రవేశ పెట్టింది.

ప్రయోజనాలు మహిళల ఆరోగ్యం మెరుగుపడుతుంది. రోజు వారి చాకిరీ నుంచి విముక్తి కల్గుతుంది. వంట చెరకు కోసం

అడవి పై ఆధారపడే పరిస్థితిలో మార్పు, చెట్లునరికివేత తగ్గి పర్యావరణం మెరుగుపడుతుంది. మహిళల సమయం కుడా ఆదా అవుతుంది.

లబ్ది దారులు గ్రామీణ నిరుపేద స్త్రీలు అయివుండాలి. మహిళలు దారిద్ర రేఖకు దిగువన ఉండి డ్వాక్రా వంటి ఏదైనా స్వయం సహాయ బృందంలో సభ్యత్వం కల్గి ఉండాలి. ఆసభ్యత్వం కనీసం ఏడాది నుంచి ఉండాలి. 10లక్షల గ్యాస్ కనెక్షన్లు వెంటనే జారీ చేస్తారు. ప్రభుత్వ రంగ చమురు సంస్థలు ఈ పధకాలు అమలు పరుస్తాయి. పంపిణీ వ్యవస్థలో పరిమితుల దృష్ట్యా తొలిదశలో మండల కేంద్రానికి 10 కిలోమీటర్ల దూరంలో ఉన్న నివాసాలలో ఈ పధకాన్ని ఆమలు చేస్తారు. మిగతా గ్రామాలకు కూడా ఆ తర్వాత ఇవ్వబడును.

ప్రస్తుతం ఉన్న ఎల్.పిజి డీలర్లే ఈ కనెక్షన్లను ఇస్తారు. డీలర్లు లేని చోట్లలో జి.సి.సి పౌర సరపరాల కార్పోరేషన్ వంటి ప్రభుత్వ సంస్థలు ఎల్.పి.జి కనెక్షన్లను పంపిణి చేస్తారు. ముఖ్య మంత్రి యువశక్తి (సి.ఎం.ఇవై) పధకంలో ఉత్తమ గ్రూప్‌ను జి.సి.సి పౌర సరఫరాల కార్పోరేషన్‌లు తమ ఏజెంటుగా ఇందుకోసం వినియోగిస్తాయి. రాష్ట్రప్రభుత్వం సిలెండర్ డిపాజిట్, రెగ్యులేటర్ కొరకు అయ్యే ఖర్చు కనెక్షన్ కు 1000 రూాల చొప్పున భరిస్తుంది. లబ్దిదారులు రబ్బరు ట్యూబ్, గ్యాస్ స్టౌవ్ ధరతో పాటు 20 రూాలు డీలర్ల పరిపాలనా ఖర్చుల క్రింద చెల్లించవలసి ఉంది. ఈ పధకం అమలును రాష్ట్ర జిల్లాస్థాయి అధికార కమిటీలు పర్యవేక్షిస్తాయి. రాష్ట్ర వ్యాప్తంగా 1098 గ్రామీణ మండలాలలో కనెక్షను

ఇస్తున్నారు. డ్వాక్రా గ్రూపుల సంఖ్యను బట్టి వీటిని ఎ,బి కేటగిరీలుగా విభజించారు. ఎ కేటగిరి మండలాలకు 1000.బి కేటగిరి మండలాలకు 800 కనెక్షన్లు మంజూరు చేస్తారు. గ్యాస కనెక్షన్ కేటాయింపు నిర్ణయించేటపుడు డ్వాక్రాగ్రూప్ తీర్మానాన్ని పరిగణనలోకి తీసుకుంటారు. మండల కేంద్రానికి 10 కి.మీటర్ల దూరంలో ఉన్న నివాసాలకు ప్రధమ ప్రాధాన్యం.



మేధావులు, వివిధ వర్గాల ప్రజల మంచి స్పందన ప్రజాదీవెన గత 41/2 ఏళ్ళుగా సాగించిన కృషికి బ్రేక్ పడకూడదని అందరు కోరుకుంటున్నారు. వచ్చే ఐదేళ్ళలో మరింత అభివృద్ధి సాధించేందుకు అందరి సహకారం అవసరం. అందుకే రాజకీయాలకు దూరంగా ఉంటున్న వారిని కూడా తిరిగి రాజకీయాల ద్వారా ప్రజాసేవలో పాల్గొనేలా మంచి వాతావరణం సృష్టించడమే తన కర్తవ్యం, ప్రజలందరి భవిష్యత్తును పర్యవేక్షించేది ప్రభుత్వం బాగా పనిచేస్తే ఆఫలితాలు ప్రజలకు దక్కుతాయని చంద్రబాబు చెప్పారు. ప్రజల కనీస అవసరాలైన విద్య, ఆరోగ్యం, విద్యుత్, పారిశుద్ధ్యం,శాంతి భద్రతలు మొదలైన వాటిని సజావుగా నిర్వహిస్తే ఆర్థిక వ్యవస్థ మెరుగుపడి పరిశ్రమలు అభివృద్ధిచెంది ఉపాధి అవకాశాలు పెంపొందుతాయి. క్రింద స్థాయి వరకు సంక్షేమ కార్యక్రమాలు చేరడానికి కూడా మంచి ప్రభుత్వం ఉండాలి. ఇవన్ని సజావుగా జరగాలంటే ఎవరికి వారు తనకు సంబంధం లేదనుకోరాదని, కాలక్రమేణా విలువలు పతనమై మంచివారు రాజకీయాలకు దూరమయ్యే పరిస్థితి ఏర్పడింది. డబ్బు ఉన్న

వారు, భూఆక్రమణ దారులు, నేరస్తులు, రౌడీలు, రాజకీయాల్లో చేరారు. మంచి వారెవరైనా రాజకీయాల్లోకి వచ్చినా పని చేయలేక నిస్పృహయుంగా ఉంటుంన్నారు. నిరాశ నిస్పృహలతో మంచి వారంతా మిగిలి పోవడం సరికాదని, ఆపరిస్థితులలో మార్పు తెచ్చి రాజకీయాలలో సరిక్రొత్త సంస్కరణలకు శ్రీకారం చుట్టడానికే తాను ప్రజాదీవెనను సంకల్పించాము. గతంలో ఎన్నడూ ఎవరు ఇటువంటి కార్యక్రమం చేపట్ట లేదని, దీని పట్ల అనేక మంది ఆకర్షితులవుతున్నారు. గత 4 ఏళ్ళుగా ఎన్నో పనులు చేపట్టాం, కేవలం తాత్కాలికమైన పనులు కాక ధీర్ఘకాలిక దృష్టితో అభివృది, సంక్షేమ చర్యలు తీసుకున్నాం ఆస్తుల ఏర్పాటు ఉపాధి కల్పనకుగాను రాష్ట్రంలోని సహజ వనరులను, మానవవనరులను వినియెగించు కోవడానికి ఎన్నో వినూత్న పధకాలు రూపొందించావము. అవన్ని ఇపుడే ఫలాలు అందిస్తున్నాయి. అందుకే రాజకీయాలకు దూరంగా ఉంటున్న తటస్తులకు ఒక విజ్ఞాప్తి చేస్తున్నాను. 4 ఏళ్ళలో ప్రజల కోసమే అహర్నిశలు పని చేశాను. నాకు కొన్ని ఇబ్బందులు వచ్చాయి, అయినా వాటిని అధిగమించడానికి అన్ని ప్రయత్నాలు చేసాం. ప్రతి సమస్యకు ఏది మంచి పరిష్కారమో ఆలోచించి దానిని అమలు చేసాము. కరువు, వరదలు, ఆత్మహత్యలు ఎన్నో సమస్యలు వచ్చాయి. అయినా ఎక్కడా నైతిక స్థైర్యం దెబ్బతిన లేదు. ప్రజలను సనాయుత్తం చేయుడం ద్వారా, ప్రజలకు చైతన్యవంతులను చేసి వారిని భాగస్వాముల్ని చేయడం ద్వారా ముందుకు సాగాం. ప్రజలలో పాజిటివ్ ఆలోచనలు వచ్చేలా చేశాం. నేను ఎంతగా కష్టపడడానికి సిద్ధంగా ఉన్నాను. ఒక డైరెక్షన్ ప్రకారం

రాష్ట్రాన్ని ప్రగతి పథంలో నడిపించి స్వర్ణాంధ్రప్రదేశ్‌గా మార్చడానికి అన్ని యత్నాలు చేస్తున్నాను. ఈ దశలో అందరు నాకు మరింతగా అండదండలందిస్తే ఎంతో చేయవచ్చు, అలా కాక నన్ను బలహీన పరిస్తే మొత్తం అభివృద్ధి ప్రక్రియ బలహీనపడుతుంది. ఆర్థిక సంస్కరణలు, పాలనా సంస్కరణలు, అన్ని ప్రభుత్వ శాఖలో కౌన్సిలింగ్ విధానం, ప్రభుత్వానికి గల విచక్షణాధికారం తొలగింపు వంటి ఎన్నో సంస్కరణలు చేపట్టాం. ఇకపై రాజకీయ సంస్కరణలు తేవాలని భావిస్తున్నారు. మంచి చేస్తే వారిని ప్రజలు వదలరు. చెడును ఖండించి, మంచిని ప్రోత్సహించడానికి ప్రజాదీవెన బాగ ఉపకరిస్తుంది. సొంత పార్టీలోనే కాక ఇతర పార్టీలలో కూడా ఇదే విధంగా చెడును ఖండించేలా ప్రజలలో చైతన్యం రావడానికి తాము కృషి చేస్తున్నాము. తెలుగుదేశంలో మానవ వనరుల విభాగాన్ని పటిష్టం చేసి ఎన్నో తక్షణ కార్యక్రమాలు నిర్వహిస్తున్నాము. ప్రొఫెషనలిజం, ఆధునిక విధానాల ధ్వారా తక్కువ సమయంలో ఎక్కువ సేవలందించేలా చేస్తున్నాం. ప్రజలు అన్ని విషయంలో అప్రమత్తంగా ఉండాలని అంటూ భారతీయులు కూడా పని చేసి లక్ష్యాలను సాధించగలరన్నది రుజువు చేయడమే తన లక్ష్యము. ఎందరో వ్యక్తులు సొంతగా కష్టపడి అధ్భుతాలు సాధించినపుడు ప్రభుత్వం ఎందుకు చేయలేదన్నదే తన ప్రశ్న, ఏ కారణాల వల్లనైనా ప్రజలు సహకరించక రివర్స్ అయితే ప్రగతి అంతా రివర్స్ అవుతుంది. అపుడు ఎవరు బాగుచేయలేరని, రైతుబజారులు సంతలుగా మారుతాయి. ఎంతో శ్రమించి అభివృద్ధి చేసిన స్వయం సహాయ సంఘాలు. వెనక బడతాయి. కొన్ని ప్రాంతాలలో ఫ్యాక్షన్

రాజకీయాలు ఉన్నాయని, వ్యవస్థలో మార్పులు తేవడం ద్వారా వారిని అరికట్టవచ్చు. ఆదిశలోనే తమ పార్టీ పయనిస్తుంది. ప్రజలే ఎన్నికల వ్యయాన్ని భరించే విధంగా రాజకీయాలు మారాలి. రాజకీయాలు స్వచ్ఛంగా తయారవ్వడానికి రాజకీయ నాయకులు విధానాల నిర్ణయాలకు పరిమితమై అభివృద్ధి సజావుగా సాగడానికి వీలుగా సంస్కరణలు రావాలి.



రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు వేతన సవరణ సంఘం చేసిన సిఫారసుల మేరకు రూ 19,675 ఉంటుంది ఆర్.కె. ఆర్ గోనెల నేతృత్వంలోని వేతన సవరణ సంఘం ప్రభుత్వానికి సమర్పించిన నివేదికలోని సిఫారుసుల విశేషాంశాలు ఈ విధంగా ఉన్నాయి. పి. ఆర్. సి సిఫారుసుల వల్ల 20 శాతం ఫిట్‌మెంట్ ప్రయోజనం కల్గుతుంది. పదవి విరమణ చేసిన వారికి కనీస పెన్షన్ 1275/-రూాలు ఉంటుంది. 1-7-1998 నుంచి అమలు చేయాలని ప్రతిపాదించివప్పటికి ఆర్థిక ప్రయోజనం మాత్రం 1-4-1999 నుంచి ఇవ్వాలని ప్రతిపాదించారు. 1-7-98 నాటి డి. ఏ ను మూల వేతనంతో కలిపి సిఫారసు చేస్తారు. క్రొత్త వేతన సవరణ సిఫారసుల వల్ల ప్రభుత్వం పై 1257.82/-కోట్లు అదనపు భారం పడుతుంది. డి. ఏ ఇవ్వడంలో కేంద్ర ప్రభుత్వ విధానాన్ని అనుసరించాలని పి. ఆర్. సి. సిఫారస్ చేసింది. 45 సంవత్సరాలు వయస్సు దాటిన వారికి ప్రమోషన్లకు డిపార్ట్‌మెంటల్ పరీక్షల నుంచి మినహాయింపు ఇవ్వాలని ప్రతిపాదించారు. కఠినమైన విధులు నిర్వహిస్తున్న వారికి మాత్రమే ప్రత్యేక వేతనాలు ఇవ్వాలని ప్రతిపాదించారు. ఇది 50

శాతానికి మించకుండా దించారు. ఇది 50 శాతానికి మించకుండా ఉండాలి. ఇప్పుడున్న ఇంటి అద్దె అలవెన్సులు (హెచ్.ఆర్.ఏ) కొనసాగుతుంది. అయితే ఇపుడు నెలకు ఇచ్చే అలవెన్స్ వెయ్యి రూపాయాలు గరిష్ఠ పరిమితిని రూ 1500లకు పెంచాలని సిఫారసు చేసారు. అదనపు హెచ్.ఆర్.ఏ. పరిమితిని కూడా రూ 150/-నుంచి రూ 250కి పెంచారు. సి.సి.ఏ విషయంలో కేంద్ర ప్రభుత్వవిధానాన్ని పాటించాలని ప్రతిపాదించారు. ఎ.టి.సి విషయంలో ఉద్యోగ సంఘాలు చేసిన సిఫారసులు అంగీకరించ లేదు. ఇప్పుడున్న విధానాన్నే కొనసాగించాలని సిఫారసు చేసారు. కుటుంబ సంక్షేమ పారితోషికాలు ఇక పై ఉపసంహరించాలని సాఫారసు చేసారు. ప్రభుత్వ ఉద్యోగుల పిల్లలకు ఇచ్చే ట్యూషన్ ఫీజు రీఇంబర్స్‌మెంట్‌ను 200 నుంచి రూ300లకు పెంచాలని ప్రతిపాదించారు. గృహనిర్మాణ అడ్వాన్సులు, వాహనాలు కొనుగోలు రుణాల పరిమితిని గణనీయంగా పెంచుతూ సిఫారసు చేసారు. రూ 5,300 రూాలు వరకు మూాల వేతనం పొందేవారు. ఇపుడున్న రూ1.65లక్షల బదులు రూ2.50లక్షలు గానీ మూాలవేతనం పై 60 రెట్లు. ఏది తక్కువైతే అది అడ్వాన్స్ పొందుతారు. రూ.5300-8400 మధ్య మూల వేతనమున్న వారు రూ.3.75లక్షలు, రూ12,100 పైబడి మూలవేతనమున్న వారు రూ 4.50 లక్షల అడ్వాన్సు పొందుతారు. సైకిల్‌కూ రూ1800 మోపెడ్‌కు రూ 30,000 మోటారు కారుకు రూ 2లక్షల రూాల వరకు రుణం లభిస్తుంది నాలుగో తరగతి ఉద్యోగులకు వివహాఅడ్వాన్సును 50 శాతం మేర, ఇతర ఉద్యోగులకు 25 శాతం

మేర పెంచే విధంగా సిఫారసు చేశారు. పండుగ అడ్వాన్సు అందరు ఉద్యోగులకు 50శాతం, పెంచాలని నివేదించారు. ఎడ్యుకేషనల్ అడ్వాన్స్ పరిమితిని వెయ్యి రూపాయల నుంచి రెండు వేలకు పెంచారు. ప్రభుత్వ ఉద్యోగులకు వైద్య ఖర్చుల పరిమితిని రూ 75,000కు పెంచారు. ఈపరిమితి ఇపుడు రూ 50,000మాత్రమే ఉంది ఆరోగ్య భీవమా పథకాన్ని ఉద్యోగులకు అమలు చేసే విషయన్ని పరిశీలించాలని. పి.ఆర్.సి తో పేర్కొన్నారు. వర్క్ చార్జ్డ్, ఫుల్ టైం కంటింజెంట్ ఉద్యోగుల విషయంలో యధాతధి పరిస్థితి కొనసాగించాలని సిఫారసు చేసారు.పదవీ విరమణ చేసిన ఉద్యోగులు 40%పెన్షన్‌ను కమ్యూట్‌చేసుకోవచ్చు. ప్రస్తుతం పెన్షన్ కమ్యూటేషన్ పరిమితి 33 1/3శాతం ఉంది అదే విధంగా రిటైర్మెంట్ గ్రాట్యుటీ పరిమితిని రూ.1.75లక్షల నుంచి రూ 2.50 లక్షలకు పెంచాలని ప్రతిపాదించారు. పెన్షనర్లకు ఆరోగ్యభీవమాపథకాన్ని పరిశీలించాలని కూడా నివేదికలో పేర్కొన్నారు. పెన్షన్లు జీతాలను మించి పెరిగే అవకాశాలున్నందున పెన్షన్ ఫండ్స్ ఏర్పాటు చేయాలని ప్రతిపాదించారు. ప్రతి సంవత్సరము సర్వీసు నిబందనలు అప్‌డేట్‌చేస్తూ అన్ని సవరణలు పొందుపర్చాలని, మిగులు సిబ్బందిని అవసరమున్న చోట వాడుకునే విధంగా చర్యలు తీసుకోవాలని కూడా పి.ఆర్.సి చైర్మన్ సిఫారసు చేసారు.

తెలుగుదేశం ప్రభుత్వం హయంలోనే వెలిగొండ ప్రాజెక్టు పూర్తి సాధ్యమవుతుంది వెలిగొండ ప్రాజెక్టు నిర్మాణానికి రూ 137 కోట్లతో పరిపాలనా ఆమోదం ఇచ్చాము. తొలివిడతగా

రూ.5.22కోట్లతో ప్రాజెక్టు పనులకు టెండర్లు పిలిచాము. దివంగత ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు జిఓ జారీ చేయగా తన హయంలో మార్కాపురం మండలంలో గొట్టిపడియ వద్ద ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశాను, మళ్ళీ అయిదేళ్ళ పాటు ఇరవైనాలుగు గంటలు కష్టపడి ఆదర్శ రాష్ట్రంగా తీర్చిదిద్దుతాము. స్వర్ణాంధ్రప్రదేశ్ సాధించుకుందాం. ప్రజలిచ్చే బలమే తన బలమని నిండు మనసు తో ఆశీర్వదించారని ముఖ్యమంత్రి అన్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సేద్యపు నీటిరంగం అత్యధిక ప్రాధాన్యతను కలిగి ఉంది. రాష్ట్ర వ్యాప్తంగా 20 భారీ,93 మధ్యతరహా సేద్యపు నీటి పథకాల ద్వారా 4.84 మిలియన్ హెక్టారులు సాగు అవుతున్నాయి. రాష్ట్రసమగ్ర అభివృద్ధికి నీటి వనరుల అభివృద్ధి ఎంతో అవసరం. రాష్ట్రంలో వ్యవసాయ విప్లవం వెనుక సేద్యపు నీటిరంగం అభివృద్ధి కీలకమైన శక్తిగా ఉంది. సేద్యపు నీటి పరిస్థితులలో ఆహారధాన్యాలు, యితర పంటల ఉత్పత్తి దాదాపుగా మూడింతలైంది. అందుబాటులోకి వచ్చిన, రానున్న నీటి వనరులు రైతులలో కొత్త ఆశలు కల్పించాయి. ఫలితంగా వారు వ్యవసాయంపై అధిక పెట్టుబడులు పెడుతున్నారు. ఖరీదైన పంటలు వేస్తున్నారు. ఊపందుకుంటున్న వ్యవసాయ కార్యకలాపాలతో ఉపాది అవకాశాలు కూడాపెరుగుతున్నాయి. వ్యవసాయ గ్రామాభివృద్ధి ప్రాముఖ్యత కష్టమవుతుంది. సేద్యపు నీటి వనరుల అభివృద్ధి వల్ల రాష్ట్రంలోని అన్ని పట్టణ గ్రామీణ ప్రాంతాలలో త్రాగు నీరు కూడా లభ్యమౌతుంది. దీనికి తోడు ఆనకట్టలు రిజర్వాయర్లు అభివృద్ధి చెంది అటు విద్యుదుత్పత్తికి, ఇటు ప్రకృతి వైపరీత్యాల నుండి రక్షణ తోడ్పడుతున్నాయి. ఈ

కారణాల చేత సేద్యపు నీటి రంగం రాష్ట్ర ప్రాధాన్యత రంగంగా ఆవిర్భవించింది. ప్రణాళికా పరంగా యింత వరకు ఈరంగం పై 64,000 కోట్లు రూపాయలు ఖర్చు చేయడం జరిగింది.

**సేద్యపు నీటిరంగంలో మూడంచెల విధానాన్ని ప్రభుత్వం చేపట్టింది**

ప్రస్తుత పధకాలన్నింటిని పూర్తి చేయడం.11.80 లక్షల ఎకరాల ఆయకట్టును సాగులోకి తీసుకురావడం సేద్యపు నీటి వనరుల నిర్వహణ బాధ్యతలు రైతు సంఘాలకు అప్పగించటం.

మరో 10.80 లక్షల ఎకరాలను సాగులోకి తీసుకు రావడానికి వీలుగా ప్రస్తుతం నిర్మాణంలో ఉన్న సేద్యపు నీటి ప్రాజెక్టులన్నింటినీ పూర్తి చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది.

37 భారీ సేద్యపు నీటి ప్రాజెక్టులు

42 మధ్యతరహా సేద్యపు నీటి ప్రాజెక్టులు

నాబార్డ్ ఏ.ఐ.బి.పి, ప్రపంచబ్యాంకు ఓ.ఇ.పి.ఎఫ్ మరియు బ్యాంకుల ద్వారా పై ప్రాజెక్టుల కోసం 3000 కోట్ల రూపాయల నిధుల సమీకరణ.

తమ పరిధిలోని సేద్యపు నీటి పధకాలను తావే నిర్వహించుకునే విధంగా రైతులకు ప్రత్యేకమైన నిర్దిష్టమైన హక్కులు కల్పించడానికి వీలుగా ఆంధ్రప్రదేశ్ ఫార్మర్స్ మేనేజ్మెంట్ ఆఫ్ ఇరిగేషన్ స్కీమ్స్ చట్టానికి రూపకల్పన.



1977 జూన్ లో నీటి వినియోగదారుల సంఘాలకు ప్రభుత్వం

ఎన్నికలు జరిపించి, ఆంధ్రప్రదేశ్ ఫార్మర్స్ మేనేజిమెంట్ ఆఫ్ ఇరిగేషన్ సిస్టమ్స్ యాక్ట్ (1029 కోట్లు యు.ఎ.యస్ 174 డి.సి.ఎస్)ను అమలు లోకి తెచ్చింది.

యిటువంటి చట్టం తీసుకురావడం భారతదేశంలోనే యిది ప్రధమం.

## రైతులకోసం ఇది ఒక వినూత్న చట్టం

సేద్యపు నీటి వనరులపై అజమాయిషీ బదిలీకి ఇది దోహదం చేస్తుంది.

సేద్యపు నీటి కొరకు మరింత బాధ్యత జవాబు దారితనం. నీటి వినియోగదారుల సంఘాలకు పాలన పరమైన నిదుల సంబదమైన ఆర్ధిక పరమైన ప్రతిపత్తి సమర్ధంగా నీటి వనరుల నిర్వహణలో వాడుకదారుల

భాగస్వామ్యం.

స్థానికంగా నీటి వనరులను సమర్ధవంతంగా నిర్వహించడానికి వాటిని ఉపయోగించుకునే వారినే భాగస్వాములను చేయుడం ఉత్తమమైన పద్ధతి ఈవిషయాన్ని గుర్తించిన రాష్ట్రం నీటి వినియోగదారుల సంఘాలు సృష్టికి నాంది పలికింది. నీటి వనరుల నిర్వహణ (ఉపయోగించు కోవడం పరిరక్షించుకోవడం) ఈ సంఘాల ప్రధాన లక్షం.

నీటి వనరుల నిర్వహణకు నిధుల సమకూర్చుడం కాకుండా పనులు పర్యవేక్షణ, నీటికేటాయింపులపై న్నిర్ణయం సేవల మెరుగుదల ఈ సంఘాల ప్రధాన లక్ష్యాలుగా ఉన్నాయి.

ఉత్తమ పర్యవేక్షణ 96%

నిర్ణయాలు తీసుకోవడం 96%

పనులు చేపట్టేస్వేచ్ఛ 94%

పారదర్శకత 92%

నిధుల వినియోగం 94%

నీటి వినియోగదారుల సంఘాల ప్రయోజనాలు

బేటర్ వాటర్ కన్సేషన్ 90%

సకాలంలో నీటి సరఫరా 90%

నీటి సరఫరా పెరుగుదల 89%

ఆయకట్టు చివరివరకు నీటి సరఫరా 87%

ఆయకట్టు పెరుగుదల 82%

ఆయకట్టు దృవీకరణ 82%

సకాలంలో నీరు 80.67%

వ్యవస్థలో మెరుగుదల 83.67%

ఆయకట్టులో 76.78%

పంటలో దిగుబడిలో 76.47%

సేద్యపు నీటి వివాదంలో 81.72%

ముంపు విషయంలో 54.73%

మొదటి సారిగా 1998-99లో ఎకరాకు 100రూ.చొప్పున ఓ అండ్ ఎమ్ నిధులకు రైతు సంఘాలకు విడుదలచేసాము.రైతులు పనులు చేపట్టేలా పనుల నిర్వహణ పద్ధతులు తెలుసుకునేలా చూసేందుకు ఈనిధులు విడుదల చేశాం.19,732 పనులు చేపట్టి,16,000పైగా పనులు పూర్తిచేయడం జరిగింది.

మొదటి సారిగా ప్రయోజనాలను పని చూసిన రైతులకు ఇది గొప్ప విశ్వాసాన్ని ఉత్తేజాన్ని యిచ్చింది.యింతకు ముందు మాదిరిగా ఒక ప్రాతంలోను లేక కొన్ని ఎంపిక చేసిన ప్రాంతాలలో గాకుండా మొత్తం ఆయకట్టులో పనులు చేపట్టడం జరిగింది.

తమప్రాంతాలలో చేపట్టిన పనులేమిటో రైతులు గుర్తించగలిగారు.ఈపనలను ప్రజలు కూడా చూడగలిగారు.

రైతులు యంత్రాలను అద్దెకు తెచ్చుకొని 300 లక్షల క్యూబిక్ మీటర్ల కు పైగా పూడికను తొలగించారు. 16000 కి పైగా నీటి పారుదల వ్యవస్థలకు మరమ్మత్తులు చేయడంలోపాటు గేట్ల పెయింటింగ్ వంటి పనులు కూడా నిర్వహించారు. ఈ పనులు వల్ల చేకూరిన ఫలితాలలో 5.12 లక్షల ఎకరాలకు సేద్యపునీరు లభించడంలో పాటు 614కోట్లు రూపాయల విలువైన వ్యవసాయ ఉత్తతి సాధ్యపడింది.

అపరిమితమైన సేద్యపు నీటి వనరులు గణనీయమైన అదాయాన్ని యివ్వడం ప్రారంభించాయి ఉదాహరణకు 9500 ఎకరాల శ్రీరామ్‌నగర్ ప్రాజెక్టునీటి వినియోదారులు సంఘల ఏర్పాటులో మొదటి సంవత్సరం 237000 ఎకరాలకు ఈ ఏడాది

345000 ఎకరాలకు పెరిగింది.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమం క్రింద ఇరిగేషన్ ప్రాజెక్టుకు 1114 కోట్ల రూపాయలు ఖర్చు చేశారు.

కనీసపునరవాసం రూ 336 కోట్లు

ఎస్.వై.ఎఫ్.టి రూ120కోట్లు

ఒ. అండ్.ఎమ్ రూ600కోట్లు

యమ్.ఐ.యస్ రూ29కోట్లు

హెచ్.అర్.డి రూ29కోట్లు

**రైతుల సంఘాల ద్వారా 1998-1999 లో వ్యయం**

కార్యక్రమాలు కేటాయించినది

ఖర్చుయింది

1. ఒ అండ్ ఎమ్ క్రింద నిర్వహణ

పనులు (ఎకరానికి 100 రూ చోపున) రూ107కోట్లు

రూ66కోట్లు

2. నీటి వినియోగదారుల సంఘాలకు

ప్రోత్సాహకం సంఘాలకు

రూ 50,000 యితర సంఘాలకు రూ30000)

రూ40 కోట్లు

రూ40కోట్లు

3. ఎ.పి.ఇ. ఆశక్రింద కనీస పునరావాసం

(అన్ని భారీ మధ్యతరహ సేద్యపునీటి పథకాలు)

రూ.60కోట్లు రూ24కోట్లు

4. గండ్లు పడిన చిన్న తరహా సేద్యపు నీటివనరులకు మరమ్మత్తులు

రూ.5 కోట్లు రూ.2కోట్లు

5. క్రెయిన్‌ల పెరుగుదల రూ22కోట్లు రూ10కోట్లు

6. సి.ఎ.డి.ఎ క్రింద

ఎస్.ఆర్.ఎస్.పిలోని ఫీల్డ్‌చానల్స్ 5కోట్లు రూ రూ. 2కోట్లు

7.శిక్షణా కార్యాక్రమాలు రూ3కోట్లు రూ.25కోట్లు

మొత్తం రూ285కోట్లు రూ156.50కోట్ల

1990-2000 కార్యక్రమాల లక్ష్యాల రూ 400కోట్లు వనరులు, సాంకేతికపరమైన సహాయ, సహకారాలు అందిచడం ద్వార సేవల వికేంధ్రీకరణలో తన క్రియాశీల పాత్రను కోనసాగిండానికి రాష్ట్ర ప్రభుత్వం కృత నిశ్చయంతో ఉంది. కనబడునున్న సర్వతోముఖాభివృద్ధి రైతుల సానకూల స్పందన దృష్ట్యారానున్న సం!! లో రైతుల ప్రమోజనాలకోసం మరిన్ని నిధులు కేటాయించాలని ప్రభుత్వం భావిస్తుంది. రాష్ట్ర సర్వతో ముఖాభివృద్ధికి ముఖ్యసేవకుడు మన నారా చంద్రుడు వెన్నెల కిరణాలు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మహిళా సార్ధకతకు అత్యున్నత ప్రాముఖ్యతనిస్తూ అన్ని స్దాయిలో ఉన్న మహిళలను ఆర్ధికాభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చేసి తద్వారావారు ఆర్ధిక ప్రగతిని

సాధించేలా కృషి చేస్తుంది. మన రాష్ట్ర ప్రభుత్వం అన్ని రంగాల్లో మహిళల పిల్లల అభివృద్ధి కొరకు వివిధ పధకాలను ప్రవేశపెట్టి వారి స్థితిగతులలో అభివృద్ధిలో గణనీయమైన మార్పులు తీసుకొని రాగలిగింది. అదే విధంగా మహిళలకై 33 1/3రిజర్వేషన్లు కల్పించడము ద్వారా వారికి ప్రత్యేక గుర్తింపు లబించింది. అన్నీ రంగాల్లో ముఖ్యంగా విద్య ఉపాది ఆర్ధిక రంగాల లో మహిళల్కై ఎన్నో అవకాశాలనుమన ప్రభుత్వం కల్పించింది. ఆంధ్రప్రధేశ్ ప్రభుత్వం ప్రధానంగా పిల్లల అభివృద్ధి బాల కార్మిక వ్యవస్థ నిర్మూలన నిర్భంద ప్రాధమిక విద్య పౌష్టికాహార పంపిణీ ఆరోగ్య సంరక్షణ మొ !! కార్యక్రమాలను అత్యంత శ్రద్ధతో తగిన వనరులను సమకూరుస్తూ బాల కార్మికుల కనీస అవసరాలను తీర్చేందుకు కృషి చేస్తోంది. సమగ్ర శిశు అభివృద్ధి సేవా పధకం ద్వారా అందించేసేవలు.

| ఆరోగ్యము | పోషణ |
|---|---|
| వ్యాధినిరోధక టీకాలు | అనుబంధ పోషకాహారము |
| ఆరోగ్య పరిక్షలు | పెరుగుదల అభివృద్ధి పర్యవేక్షణ |
| రిఫరల్ సేవలు | అరోగ్యము మరియు పోషకాహారము, విద్య |
| సాధారణ వ్యాధులకు చికిత్స | పూర్వ ప్రాధమిక విద్య సమన్వయము |

**సమగ్ర శిశు అభివృద్ధి పధకము ఆర్ధిక పునర్నిర్మాణ ప్రాజెక్టు**

సమగ్ర శిశు అభివృద్ధి పథకము ద్వారా అందించే సేవల నాణ్యతను మెరుగుపరుచుటకు ప్రభుత్వ యంత్రాంగాన్ని బలపరుస్తూ అదనపు కార్యక్రమాలపై కిశోర బాలికాపథకము మరియు పూర్వ ప్రాధమిక విద్యను అమలు పరచడానికి రూ 393కోట్ల రూపాయలతో ఈ ప్రాజెక్టు 5సం!! అమలు జరుపబడుతుంది.

లక్ష్యాలు

తీవ్ర పోషకాహార లోపాన్ని 6% నుంచి 3% తగ్గించడం.

ప్రాధమిక సామాన్య పోషకాహార లోపాన్ని 25% తగ్గించడం.

ప్రస్తుతమున్న శిశు మరణాల రేటును ప్రతి వెయ్యి జననాలను 60నుండి 40 కి తగ్గించడం.

తక్కువ బరువులో పుట్టే పిల్ల శాతాన్ని 24 నుండి 18 కి తగ్గించడం.

కవరేజి:

ఈ ప్రాజెక్టు కింద 4 సం!!లలో కవర్ చేయబడే ప్రాజెక్టులు.

| సం!! | గ్రామప్రాజెక్టులు | గిరిజన ప్రాజెక్టులు | మొత్తం |
|---|---|---|---|
| 1998-99 | 121 | 29 | 150 |
| 1999-2000 | 156 | 29 | 185 |
| 2000-2001 | 191 | 29 | 220 |
| 2001-2002 | 221 | 29 | 250 |

ఈ ప్రాజెక్టు ద్వారా లబ్ది పొందుతున్న వారు.

పిల్లలు 6 సం!! లోపు 27 లక్షలు కిశోర బాలికిలు 7 లక్షలు గర్భిణీ మరియు·బాలింత స్త్రీ లు 6.35 లక్షలు

**తల్లుల కమిటీలు నిర్వహించే బాధ్యతలు**

- అంగన వాడీ కార్యకర్తలు మరియు ఆయావ నియామకం
- లూపీ పనివారి గ్రూపులను గుర్తించడమూ మరియు 52,896 మంది మహిళలను లూపీ పని మీధ గృహ నిర్మాణ సంస్థ సిబ్బంది చే శిక్షణ.
- అంగని వాడీ భవ న నిర్మాణాలకు మరియు చేతి పంపులను స్థలాలను గుర్తించడం.
- స్థానికంగా లభ్యమయ్యే ఆహార పదార్థాలతో పౌష్టికాహార పంపిణీ.
- అంగన్ వాడీ,కార్యక్రమాల పర్యవేక్షణ అమలు తీరుపై అభిప్రాయాలను తెలపడం.
- కిశోర బాలికలు మరియు మహిళల్లో అవగాహన పెంచి వారినిఅన్ని విధాల అభివృద్ధి పర్చుటం.
- గ్రామ స్థాయిలో మహిళలు పిల్లల అభివృద్ధికై పనిచేసే ప్రభుత్వ శాఖలలో స్వచ్ఛంద సేవా సంస్థలలో సమన్వయ ముతో కలిసి మెలసి పని చేయడం.
- ఎ.పి.ఇ.ఆర్ ,ఐ.సి.డి.ఎస్ లోని ప్రధాన అంశాలు.

- అనుబంధ పోషకాహారము సమగ్ర శిశు అభివృద్ధి సేవా పథకంలోని ముఖ్యమైన పథకాలేకాక మన రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకంగా అతి ముఖ్యమైన అనుబంధ పోషకాహార పథకాన్ని ప్రవేశ పెడుతూ అంగన్‌వాడి కేంద్రాల ద్వారా పిల్లలకు మరియు గృహిణిబాలింతలకు అందజేస్తుంది.
- అన్ని విద్యా సంస్థలలో వృత్తి విద్యా సంస్థల్లో 33 1/3% సీట్లు కేటాయింపు.
- ప్రభుత్వ ఉద్యోగాలలో 331/3% రిజర్వేషన్లు
- వృత్తి విద్యా కోర్సులలో బాలికలకు అధిక ప్రవేశ సౌకర్యం.
- బడి మానేసిన పిల్లలకోసం బ్రిడ్జి కోర్సులు.
- అన్ని ఆర్థిక సంస్థలో 30% ఋణాల కేటాయింపు.
- బలహీన వర్గాలకు మంజూరు చేసే యిళ్ళ స్థలాల పట్టాలను మహిళల పేరు మీద యివ్వడం.
- ఆర్టీసీ బస్సులలో 40% సీట్లు కేటాయింపు.
- మహిళలకు రాష్ట్ర కమిషన్ ఏర్పాటు.
- మహిళా కోర్సులు, కుటుంబ కోర్సుల స్థాపన.
- మహిళా పొదుపు సంఘాలు ఏర్పాటు డ్వాక్రా పథకం.
- మహిళా ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలకు ప్రోత్సాహం ప్రభుత్వాన్ని ప్రజలకు సన్నిహితం చేసి ప్రభుత్వ

విధానాలను ఎప్పటికప్పుడు తెలియజేసి వారి అభిప్రాయాలను సూచనలను ఫోన్ ద్వారా తెలుసు కునే ప్రజలలో ముఖ్యమంత్రి కార్యక్రమంలో స్వయంగా ప్రజలకు వివరించారు.

**కిశోర బాలికా పథకము**

కిశోర బాలికలను అన్ని విషయంలో బలపరుచుటకు మన రాష్ట్ర ప్రభుత్వము ఈ కొత్త పథకాన్ని ప్రవేశపెట్టింది. ఎ.పి.ఇ.ఆర్ ప్రాజెక్టు అమలులో లేని ప్రాజెక్టులలో దీన్ని అమలు పరుస్తారు. ఈ పథకం కింద

- చదువుకోని బాలికలకు ఆరోగ్యము కుటుంబ సంక్షేమంలో శిక్షణ యిచ్చి ఆరోగ్య వాలంటీర్లుగా తయారు చేయడం .
- నైపుణ్యాలను పెంచే శిక్షణా కార్యక్రమాలను నిర్వహించడం.

**సూచికలు**

కిశోర బాలికలు తమ ఆహార పోషణ అవసరాలకు వారంతట వారే గుర్తించేటట్లు చేయడం.

- ఆరోగ్య వాలంటీర్ల గ్రామములోని యితర ఆరోగ్యసమస్యలను తెలుసుకొని తగిన శ్రద్ధ తీసుకోగలుగాతారు.
- నైపుణ్యా శిక్షణ వల్ల కిశోర బాలికల యితర ఆదాయానికి వృద్ధిని చేపడుతాయి. ఆడపిల్లల సంరక్షణ పథకము.

ఆడపిల్లల భారము అనే భావాన్ని తొలగించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆడపిల్లల సంరక్షణ పథకమును ప్రవేశ పెట్టింది. మూడేళ్ళలోపు ఆడపిల్లల ను ఈ పథకములో సభ్యులుగా చేర్చినపుడు రూ!! 11,5000 లు ఆమె పేరు మీద ప్రభుత్వం పబ్లిక్ ఆకౌంట్‌లో డిపాజిట్ చేస్తుంది. ఆమె ప్రాథమిక మాధ్యమిక ఉన్నత స్థాయి పాఠశాల విద్యను పూర్తి చేసేందుకై వివిధ సమయాల్లో ఆమొత్తం నుండి కొంత సొమ్మును యిస్తు ఆమెకు 20 సం!!లు పూర్తి అయినప్పుడు వివాహనికి గాని ఉన్నత విద్యరు గాని 20,000 రూ!! అందిస్తారు.

**లక్ష్యాలు**

ఆడపిల్లలకై యిప్పటి కొరకై ప్రజలలో ఉన్న ఆలోచనలో మార్పు తేవడం.

- పాఠశాలలో ఆడపిల్లల నమోదును పెంచడం.
- చదువు మానివేసే ఆడపిల్లల సుఖ్యను తగ్గించడం.
- కనీస వివాహ వయోపరిమితిని 18 సం!! వరకు ఉండేటట్లు ప్రోత్సాంహ పరచడం.
- ఉన్నత విద్యకు ప్రోత్సాహించడం ఆడపిల్లల సామాజికంగా ఆర్థికంగా బలపడేలా చూడడం.
- కుటుంబాలలో యిద్దరు పిల్లల తర్వాత కుటుంబ నియంత్రణ పద్ధతులు పాటించడం.

అర్హతలు

దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న కుటుంబాలలో యిద్దరు పిల్లలు మాత్రమే ఉండి అందులో 3 సం!! లోనే ఆడపిల్ల మాత్రమే దీనికి అర్హులారాలు.

కవరేజి లబ్ధిదారుల సంఖ్య ఖర్చుచేసిన నిధులు

1996-97 52,000

2500.00

1997-98 49,580

2500.00



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రధాన లక్ష్యంగా షెడ్యూల్డు కులాల విద్య సాంఘిక ఆర్థికాభివృద్ధి సంక్షేమం వారి రక్షణ అంటే కాక అనాధ బాలల సదనాలు బోగినులు వెట్టి చాకిరి కార్మికులు పునరావాసం పేద వింతతువులకు ఫించను వంటి సాంఘిక రక్షణ కార్యక్రమాలు చేస్తూ సాదించిన ఫలితాలు రూ.45,000కోట్ల వ్యయంతో సమాజంలో బలహీన వర్గాల వారికోసం 500 లక్షల ఇళ్ళ స్థలాల పట్టాలను పంపిణీ చేయడానికి 1998 డిసెంబర్‌నుండి 31.3.99 వరకు ఒక కార్యక్రమాన్ని చేపట్టడం జరిగింది. 27-3-99 నాటికి 6,14,915 యిళ్ళ పట్టాలని పంపిణీ చేసి లక్ష్యాన్ని అధిగమించడమైనది. 1,21,042 దళిత వర్గాలకు చెందిన పని చేస్తున్న పిల్లలను బడి మానేసిన వారిని తిరిగి పాఠశాలకుపోయే

విద్యాత్మకార్యక్రమం కింద జూన్ 1998 లో రెండు మాసాల వేసవి శిక్షణా శిబిరం నిర్వహించడం జరిగింది. శిక్షణా కోర్సు పూర్తయ్యాక 1,000, 573 మంది పిల్లలను తిరిగి బడిలో చేర్పించడం జరిగింది. హాస్టళ్లలో చేర్పించడం జరిగింది.

1988-99సం!!లో మళ్ళీ బడికి పథకము దృష్టిలో ఉంచు కొని ఈ పిల్లలకు వసతి కల్పించే ఉద్దేశము లో ప్రభుత్వం వసతి గృహాల్లో అదనము గా 25,000 సీట్లను పెంచింది. 1998-99 లో 23 కళాశాల బాలికల వసతి గృహాలు ప్రారంభించారు. యిందులో 1574 మంది షెడ్యూల్డు కులాలకు చెందిన బాలికలకు ప్రవేశము కల్పించడమైనది.

5సం!!రాలుగా ఎస్.ఎస్.సి లో 75% ఉత్తీర్ణతా శాతం సాధించిన ఉత్తమ పాఠశాలల్లో 1700 మంది ఎస్.సి విద్యార్థులకు నమోదు చేసి ప్రతి విద్యార్థికి సంవత్సరానికి 20 వేల రూపాయలు ఉపకార వేతనం మంజూరు చేయడం జరిగింది.

1998-99 విధ్య సంవత్సరంలో 303 ఎస్.సి విధ్యార్థులను బేగంపేట రామంతపూర్ లలోని హైద్రాబాద్ పబ్లిక్ స్కూల్లో చేర్చుకోవడం జరిగింది.

మెట్రిక్ అనంతర విద్యాభ్యాసానికి 1994-95 సం!!లో 1.35 లక్షల మందికి ఉపకార వేతనాన్ని యివ్వడం జరిగింది. 1998-99 సం!!లో నెలకు రూ 400.లు చొప్పున పది నెలలకు ఎంసెట్ పరిక్షల ద్వారా మొదటి సం!! వృత్తి కోర్సులలో ఎంపికైన విద్యార్థులను సిల్వర్ జూబ్లీ స్కాలర్ షిప్‌లను మంజూరు చేశారు. ఈ స్కాలర్ షిప్స్ మాములు గా పొందే పోస్టుమెట్రిక్ స్కాలర్ షిప్ కు అదనంగా యిచ్చునది.

జన్మభూమిలో అంటరానితనం నిర్మూలన గురించి, అత్యాచారాల నివారణ గురించి ముమ్మరమైన ప్రచారం ద్వారా షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు మరియు యితరులను చైతన్యవంతులను చేయడం జరిగింది.

1998-99 లో కులాంతర వివాహాల అభివృద్ధి పథకం క్రింద రూ 68.35 లక్షలు వ్యయంలో 867 కులాంతర వివాహాల జంటలకు ప్రోత్సాహక అవార్డులు మంజూరు చేయడం జరిగింది.

1998-99 సం!!లో ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు కులాల కో-ఆపరేటివ్ ఫైనాన్స్ కాంపిటిషను అమలు చేసిన పథకముల ద్వారా మొత్తం రూ.168.07 కోట్లతో 1,99,502 మంది లబ్దిదారులు లక్ష్యంకాగా రూ146.46కోట్ల ఖర్చుతో 1,53,458 మంది కి లబ్ధి పొందేలా ఫలితాలు సాధించారు.

1998-99 లో ప్రభుత్వం 38 క్రొత్త వైవాహిక (Residential) పాఠశాలలు మంజూరు చేయడమైనది. అందులో 34 ఈవిద్యా సం!!లో ప్రారంభించబడ్డాయి.

ఆంధ్రప్రదేశ్ స్టడీ సర్కిల్ 24 మంది అభ్యర్థులను సివిల్ సర్వీస్ పరీక్షకు తయారు చేసి పంపగా 13 మంది ఉత్తీర్ణత సాదించారు. ఇందులో ఐ.ఎ.ఎస్ ,ఐ.పి.ఎస్ లకు యిద్దరేసి ఎంపికకాగా తక్కువవారు యితర కేంద్ర సేవలు సాధించారు.

నేను మనసావాచా సెక్యూరిస్టను ఎన్నికల కోసం కాక సెక్యూలర్ భావాన్ని నూటికి నూరు శాతం నమ్మిన వాడిని సమాజంలో మెజారిటీ వర్గాలతో సమానంగా మైనారిటి వర్గాలను

అన్ని రంగాలలో పైకి తేవాలన్నది నాధ్యేయం. తెలుగు దేశం పార్టీలోని ప్రతి కార్యకర్త లౌకికత్వంతో మెలగాలి కార్గిల్ లో పోరాడుతున్న భారత సైనికులకు మద్దతు గా ముస్లింలు మసీదుల్లో ప్రార్ధనలు చేస్తున్నారు. మైనారిటీలు మెజారిటిలు అన్న భేదా భావం లేకుండా అందరూ సమాన స్ధాయికి ఎదిగేందుకు కృషి జరగాలి.



ప్రజాభిమానాన్ని చూరగొనడంలో జాతీయ పార్టీలు విఫలమైనందువల్లనే దేశంలో సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయి. భవిష్యత్తులో ఎలా ఉన్నా ఇప్పుడు మాత్రం కేంద్రములో అదే తరహా ప్రభుత్వం అని వార్యం .జాతీయ పార్టీలు కొన్ని ప్రాంతాలకే పరిమితమై పోయాయి. జాతీయ స్ధాయి పార్టీల పాత్ర పరిమితమై పోతున్నందున వివిధ పార్టీలకలయికతో సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయి. ప్రపంచంలోని అనేక దేశాల్లో సంకీర్ణ ప్రభుత్వాలు సుస్ధిర పాలనను అందించగలుగుతున్నాయని మేనేజ్ మెంట్ రంగంలో ఉన్న వారికి నిరంతరం శిక్షణ అవసరమైనట్లే రాజకీయ నాయకులకు అవసరమే. వృత్తిలో నైపుణ్యం సామర్ధ్యం పెంచుకోవల్సిన ఆవశ్యకత విధాన నిర్ణాయకులైన రాజకీయ నాయకులకు అవసరమేనని తానూ అభిప్రాయ పడుతున్నామని రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన మానవ వనరుల అభివృద్ధి సంస్ధలో తానూ శిక్షణ పొందుతున్నారు. రాజకీయరంగంలో సంస్కరణలకు సమయం ఆసన్నమైనది. ఈ అంశంపై విస్తృత చర్చ అవసరము. భారతదేశములో అన్ని వనరుల ఉన్నా వాటిని సద్వినియోగం చేసుకోవడంలోనే విఫలమౌతున్నాము. ప్రజలకు ఒక మార్గదర్శకతను చూప గలిగితే

దేశం ప్రపంచంలోనే అగ్రగామిగా నిలబడగలుగుతుంది. అభివృద్ధి ఎన్నో మార్గాలున్నా తరుచూ ఎన్నికలు రావడం ప్రతిబంధకమౌతుంది. రాజకీయాలను రాజకీయనాయకుల్నిజనం ద్వేషిస్తున్నారు. 13 నెలలు కిందటే 550 కోట్లు రూపాయల వ్యయం చేసి ఎన్నికలు జరిపితే మళ్ళీ ఇప్పుడు ఓట్ల కోసం జనం ముందుకు వెళ్ళాల్సి వచ్చింది. రాజకీయ నాయకుల నిర్ణయాలు వైఖరుల్ని ప్రజలు ద్వేషిస్తున్నారని రాజకీయాల్లో నైతిక విలువలు లోపించి అడ్డదారి పద్ధతులు వచ్చాయి. పరిపాలనలో ఇదే పెద్ద ప్రతిబంధకం అవుతుంది. ప్రజలకు రాజకీయాలపై విశ్వాసం పోయింది. వారు అభివృద్ధి నే ఆకాంక్షిస్తున్నారని ముఖ్యమంత్రి అన్నారు. రాష్ట్రంలో అవకాశం ఉన్న చోటల్లా ప్రైవేట్ రంగాన్ని ప్రోత్సాహిస్తున్నాము. వివిధ అభివృద్ధి కార్యక్రమాలను ప్రభుత్వ పరంగానే నిర్వహిస్తూ వీలున్న చోట ప్రైవేట్ పెట్టుబడులను ఆహ్వానిస్తున్నాము. కష్టించేతత్వం నిజాయితీ క్రమశిక్షణతో చేపట్టే ఏపనైనా విజయవంతం అవుతుంది. చక్కని దృక్పథం (విజన్) తో ముందుకు పోతున్నందువల్లె ఆంధ్రప్రధేశ్ కు నిధుల కొరత ఏర్పడటం లేదు . రాజకీయ నాయకులు విధాన నిర్ణయాలు తీసుకునే వారైనా వారికి తగిన నైపుణ్యం ఉండదని మేనేజ్ మెంట్ రంగంలోని వారికి శిక్షణ ఎంతో ఉపయోగకరం తాను ఒక విలక్షణ దృక్పధంతో దారిద్ర్యాన్ని పూర్తిగా రూపుమాపే దిశలో స్వల్ప దీర్ఘకాలికి లక్ష్యాలతో ముందుకు పోతున్నాను. రోడ్లు నీటిపారుదల తధితర రంగాల్లో మౌలిక సదుపాయాలకు పెద్ద పీట వేస్తున్నాయి. విద్యుత్ డిస్ట్రిబ్యూటరీ కంపెనీలు కొన్నింటీని ప్రైవేటు కంపెనీలకు

ఇవ్వమన్నాము. రాష్ట్రంలో రైతుబజార్లు స్వయం సహాయక గ్రూపులు డ్వాక్రాబృందాలు నీటి వినియోగదారుల సంఘాలు, తదితర వ్యవస్థల ద్వారా బలోపేతమైన పాలన విధానాన్ని రూపొందించావము. ప్రత్యేకించి మహిళకోసం నిర్వహించిన జన్మభూమి విశేషంగా ఆకట్టుకున్న రాష్ట్రంలో త్వరలోనే హైదరాబాదు, విశాఖపట్నంలో అంతర్జాతీయం స్థాయివిమానాశ్రయాలు ఏర్పడుతున్నాయి. విజన్ 2020 కి రూపకల్పన చేశాము. ఏడురెట్లు ఆర్థిక అభివృద్ధి 20 మిలియన్ల కొత్త ఉద్యోగాల సృష్టి ఇందులో ప్రధానాంశాలు సమాచార రంగాల్లో విప్లవాత్మక మార్పుల్ని తెచ్చాము. అన్ని జిల్లా కేంద్రాలతో వీడియో కాన్ఫరెన్స్ సదుపాయం ఏర్పడింది. ఇటీవల కాలంలో టాటా గ్రూపు అత్యధిక పెట్టుబడులు పెట్టింది. ఆంధ్రప్రదేశ్ లోనే రాష్ట్రంలో అత్యధిక పెట్టు బడులు కలిగిన పారిశ్రామిక గ్రూపు కూడా తమ దేశం కావడం విశేషము చంద్రబాబునాయుడు డైనమిక్ ముఖ్యమంత్రి భవిష్యత్తులో ఇతరరంగాలకు తమ పెట్టుబడులను విస్తరించగలమని రతన్ టాటా అన్నారు. టాటా టెలిసంస్థ అందించనున్న సేవలతో రాష్ట్రంలో టెలికమ్యూనికేషన్లు విప్లవాత్మక మార్పులు వస్తాయి. సాధారణ టెలిఫోన్ సేవలతో పాటు ఐ.ఎస్.డి. ఎన్. వాయిస్ మెయిల్ లీజ్డ్‌లైన్స్ వంటి వ్యాల్యూయాడెడ్స్ సేవలను టాటా టెలి అందించబోవడం సంతోషంగా ఉంది. కమ్యూనికేషన్లు ఇన్ఫర్మేషన్ టెక్నాలజీని ఉపయోగించు కోవడం వల్ల ఊహించని ప్రయోజనాలు లభిస్తున్నాయి. తిరుపతి లో దైవదర్శనార్థం ఇటీవల ప్రవేశపెట్టిన కంప్యూటరైజ్డ్ రిజర్వేషన్ సిస్టమ్ వల్ల భక్తులకు ఎంతో మేలు జరుగుతోంది. కంప్యూటర్ల ద్వారా వెంకటేశ్వరస్వామి

దర్శనం టిక్కెట్లు ఇచ్చే కౌంటర్లను రాష్ట్రంలోని అన్ని జిల్లా కేంద్రాలకు దేశంలోని ప్రధాన నగరాలకు విస్తరిస్తాముఅని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు అన్నారు. దేశ వ్యాప్తంగా ఇంటర్ నెట్ సేవలను అందించే సదుపాయాలను టాటా గ్రూపు పరిశీలిస్తోంది. రాష్ట్రంలో అంతర్జాతీయ నాణ్యతా ప్రమాణాలు కలిగిన టెలిఫోన్ సేవలు అందిస్తున్నాము, ముమ్మందు అన్నిరకాల కమ్యూనికేషన్ సేవలు అందిచాలన్నది తమలక్ష్యము పదేళ్ళ వ్యవధిలో రాష్ట్రంలో ని టెలికమ్యూనికేషన్ల మార్కెట్‌లో 45 శాతం వాటా సాదించాలన్న తమలక్ష్యము తమ లైసెన్స్ పీరమిడ్ ఆయన 15 సంవత్సరాల్లో మొత్తం రెండు మిలియన్ల డాలర్ల సువూరు రూ.8,600 కోట్లు పెట్టుబడులు పెడతాయని రామకృష్ణన్ అన్నారు.వచ్చే యేడాది మార్చి నాటికి తమ తమ కనెక్షన్ల సంఖ్య 20-25 వేలకు చేరగలదన్న ఆశాభావాన్ని టాటా టెలి సర్వీసెస్ చీఫ్ ఆపరేటింగ్ ఆఫీసర్ శ్రీనాధ్ వ్యక్తం చేసారు. విజయవాడలో విశాఖపట్నం టాటా టెలి సేవలు ప్రారంభంకాగలవని అన్నారు. రాష్ట్రం అంతటికి సేవలనువిస్తరించేందుకు అయిదునుంచి ఏడేళ్ల వ్యవధి పడుతుంది. తమ సంస్థ బ్రేక్ ఈ వెన్ (నష్టాలు రానిస్థితి) స్థాయిని అందుకు నేందుకు కూడా అంతే వ్యవధి తీసుకుంటుంది. ర్యాంకర్ల చదువులఖర్చు సర్కారే భరిస్తుంది. ఈ ఏడాది నుంచి పోటీతత్వాన్ని పెంచడం ప్రతిభను ప్రోత్సాహించే నిమిత్తం 7,10 ఇంటర్ పరిక్షలలో పాటు వివిధ సెట్లలో మంచిర్యాంకులు సాదించిన విద్యార్థులకు అయ్యే ఖర్చులను ప్రభుత్వమే భరిస్తుందని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు అన్నారు. ఆయా పరిక్షలలో తొలి 50 ర్యాంకులు పొందిన విద్యార్థిని విద్యార్థులకు రిజర్వేషన్లు

పోటీస్తూనే ఈ పథకాన్ని అమలు చేస్తారు. ఏడాదికి కనీసం వెయ్యిమందికి ఈ పథకాన్ని వర్తింపజేస్తాము. ఇందులో 50 శాతం విద్యార్థినులు ఉంటారు. ర్యాంకులు సాధించిన విద్యార్థిని విద్యార్థులకు స్కాలర్ షిప్‌ల కూడా ఉన్నాయి.



రైతు బజార్లు చౌకడిపోల్లో ఏడాది పొడువుగా అన్నిరకాల నిత్యావసర వస్తువులకు ప్రభుత్వ ధరలును నిర్ధారించారు. రాష్ట్రవ్యాప్తంగా ఉన్న అన్ని రైతు బజార్లు చౌకధరలు దుకాణాల్లో ఈ ఏడాది పొడువుగా ఇదే ధరలతో సరుకుల్ని విక్రయింపచేస్తామని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అన్నారు. రైతు బజార్లు చౌకడిపోల్లో సన్‌ఫ్లవర్ ఆయిల్‌నుకి 36 రూ. చింతపండు 32 రూ. ఎండుమిర్చి 32 రూ. కందిపప్పు 28. విక్రయిస్తారు. ఇప్పటి వరకు అమలులో ఉన్న ధరలకంటే ఇవిరెండునుంచి 4 రూ. వరకు తక్కువ కందిపప్పు మాత్రం 3 రూ. అధికము బహిరంగ మార్కెట్‌లో ధరలను స్థిరీకరించే చర్యల్లో భాగంగా సమాంతర మార్కెట్ లో తక్కువ రేటుకు సరుకుల్ని విక్రయిస్తున్నారు. రైతులనుంచి వారికి గిట్టుబాటు అయ్యేధరకు కొని వినియోగదారులకు అందుబాటు రేటుతో సరఫరా చేస్తున్నాము. వీటన్నింటిపైన ప్రభుత్వం కొంత మేర సబ్సిడీ ఇస్తోంది. రాష్ట్రవ్యాప్తంగా 34 చోట్ల శాశ్వత రైతుబజార్లను మంజూరు చేశాము. కూరగాయలు రాక కూడా గణనీయంగా పెరిగింది. చింతపండు ధరను నియంత్రించే చర్చల్లో భాగంగా వ్యాపారులు 50 టన్నులకు మించిన ధరల కంటె మార్కెట్ లో తక్కువ రేటుకు

ఆయాసరుకులు దొరుకుతుంటె వెంటనే భారీగా కనుగోలు చేసి నిల్వచేయాలని జాయింట్ కలెక్టరును ఆదేశించాము: ఇందుకు అవసరమైన నిధులను కూడా వారికి సమకూరుస్తున్నాము. ఉల్లిపాయల సేకరణ లక్ష్యాన్ని రికార్డు స్థాయిలో లక్షటన్నులకు పెంచారు. తొలుత 40 వేల టన్నుల ఉల్లిపాయలు సేకరించాలని నిర్ణయించి ఇప్పటికే 25 వేల టన్నుల మేర నిల్వ చేసేందుకు స్టోరేజ్ సెంటర్లను సిద్ధం చేస్తున్న విషయం తెలిసిందే. లక్షటన్నుల ఉల్లిపాయల్ని నిల్వ చేసే ఏర్పాట్లు చేయాలని అదేశించామని స్టోరేజి సమస్య ఏదీ ఉండబోదని ముఖ్యమంత్రి అన్నారు.చౌక డిపోల పనితీరును మరింత పటిష్టపరుస్తున్నాము నెలవారీ తనిఖీ లక్ష్యాల స్థానే వారానికి లక్ష్యాలను నిర్ధారిస్తున్నాము. మొదటి రెండు వారాలలో మమ్మరంగా తనిఖీలు జరిపేలా సరికొత్త లక్ష్యాలను కేటాయించబోతున్నాము.

పామెూలిన్ ఆయిల్‌ను వేరుశనగనూనెలో కలిపి విక్రయిస్తున్నారనే ఆరోపణలు రావడంతో విజిలెన్స్ విభాగాన్ని అప్రమత్తం చేశాము. వ్యాపారుల్ని వేదించడం తమ అభిమతంకాదు. అక్రమాలకు పాల్పడితే సహించబోమని స్పష్టం చేశారు. రైతు బజార్లలో నూకల విక్రయాన్ని కూడా చేపట్టాలని జిల్లా అధికారులకు ముఖ్యమంత్రి చెప్పారు. ఎంతోకాలంగా చెబుతున్నా కొందరు నాయకులు ఇంకా భాధ్యతతో పని చేయడంలేదు. ఇదే పరిస్థితి కొనసాగితే కొన్ని జిల్లా కమిటీలు మరికొందరు, ముఖ్యులు బాధ్యతలను పునర్ వ్యవస్థీకరించక తప్పదని. కొందరు వ్యవహస్తున్న తీరుకు నేను చాలా

భాధపడుతున్నాను. నాలుగేళ్లుగా పడిన శ్రమ ఫలితంగా పంటబాగా పండింది. దానికోసం తెచ్చుకోవడమే మిగిలింది. అందులో మనం విఫలమైతే అది మన తప్పే అవుతుంది. నేను ఎంత సీరియస్‌నెస్‌తో పనిచేస్తున్నానో మీరు అలాగే పనిచేయాలి. చేయలేక పోతే ఆవిషయం చెప్పి తప్పుకోండి. నాయకులు ఎక్కువై పని చేసేవారు తగ్గిపోయారు. నగరాన్ని ఎంతో అభివృద్ధి చేసినా మీరు ఉపయోగించుకోవడం లేదు. కన్వీనర్ దగ్గర కనీస సమాచారం లేదు. కొన్ని కఠిన నిర్ణయాల అవసరం ఉంది. కష్టపడిన వారికి గుర్తింపు అవసరము. ఎమ్మెల్యేల పనితీరు గుర్తింపులో దీనిని ఒక ప్రాతి పదికగా తీసుకుంటాను.



ఆత్మ విశ్వాసం, ఆత్మాభిమానంలో, ఇదే స్ఫూర్తితో ముందుకు సాగండి. ఈ ప్రభుత్వం ఎల్లప్పుడూ మీకు అండదండగా ఉంటుంది. మమ్మల్ని చూసి ఇతరులు నేర్చుకోవలసింది ఎంతో ఉంది. మరో వ్యక్తి కానేకాదు."మహిళాశక్తి' అంటూ రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు డ్వాక్రా మహిళలకు ఉద్బోధించారు. మీలో దాగి ఉన్న శక్తి సామర్ధ్యాలు గ్రామీణులందరికి తెలిసేందుకు వీలుగా మీ మీ ఇళ్లపై డ్వాక్రా జెండాలు ఎగురవేయండి అధికారులసైతం వెతుక్కుంటూ మీ ఇంటికి నేరుగా వచ్చే పరిస్థితి వస్తుంది. గుంటూరు జిల్లాకు చెందిన ఓ మహిళా గ్రూపు డ్వాక్రా బజారులో రూ/50 లక్షల లాభం పొందటం గమనార్హమని సి.ఎం. చెప్పారు. మీ శక్తి సామర్ధ్యాలు చూస్తుంటే భారత దేశానికి అవసరమైన వస్తువులును తయారు

చేయాలన్న అభిప్రాయం తనకు కలుగుతుంది.

రాష్ట్రంలో డ్వాక్రా సి.ఎం.ఇ.వై. వంటి స్వయం సహాయ గ్రూపులు తయారు చేసిన ఉత్పత్తులకు మార్కెటింగ్ సౌకర్యాలను మరింత, విస్తృత పరచడానికి ప్రభుత్వం సన్నాహాలు చేస్తోంది. ఇందులో భాగంగానే ఇతర రాష్ట్రాల ముఖ్యపట్టణాల్లో డ్వాక్రా బజార్లు ఏర్పాటు చేయనున్నాము. ఆధరణ పథకం క్రింద ఆధునిక వృత్తి పరికరాలను సమకూర్చుకొని ఉత్పత్తి ప్రక్రియలో నిమగ్నమైనవారు కూడా తమ వస్తువులను ఈ బజార్లకు తెచ్చి విక్రయించుకోవచ్చును. అలాగే ఈ ఉత్పత్తుల విక్రయానికి అత్యాదునిక ఇ-కామర్స్ వ్యవస్థను ఉపయోగిస్తే అనూహ్య ఫలితాలు వస్తాయి. హైదరాబాద్‌లో గత కొద్దిరోజులుగా నిర్వహిస్తున్నా డ్వాక్రా బజార్‌లో రూ/32 కోట్ల దాకా వ్యాపారం జరిగింది. రాష్ట్రంలో స్వయం సహాయక గ్రూపుల పని తీరుపై కలెక్టర్లు డి.ఆర్.డి.ఏ. ప్రాజెక్టు డైరక్టర్లు ప్రభృతులతో ముఖ్యమంత్రి టెలికాన్ఫరెన్స్ నిర్వహించారు. అంగన్ వాడి భవనాలు స్కూల్ బిల్డింగులు డిపెప్ భవనాల నిర్మాణులను వేగిరపరచారని కలెక్టర్లను ఆదేశించారు. వివిధ పత్రికల జిల్లా అనుబందాల్లో వచ్చిన ప్రభుత్వ అనుకూల వార్తలను చదివి వినిపించారు. ప్రజల సంక్షేమం దృష్టిలో ఉంచుకుని ప్రభుత్వం అనేక పథకాలను అమలు చేస్తుంది. దీని ప్రకారం చూస్తే అనుకూల వార్తాంశాలు పెరగాల్సి ఉండగా ప్రతికూల వార్తలు విశేష సంఖ్యలో వస్తున్నాయి. పత్రికల కధనాల ఆధారంగా లోటుపాట్లును సవరించుకుని పథకాలు చక్కగా అమలయ్యేందుకు అధికారులు కృషి చేయాలి. ప్రతి పథకానికి

నిర్దేశించిన లక్ష్యాలను చేరుకొని దిగివస్తాయి. అధికారులను పేరుపేరునా గుర్తించాలి. 15రోజుల వ్యవధి వచ్చి తర్వాత వారి పని తీరును విశ్లేషించి లక్ష్యాలను అందుకోలేక పోయిన వారిపై క్రమశిక్షణ చర్యలు తీసుకుంటాము. డ్వాక్రా గ్రూపులు ఏర్పడిన సంవత్సరం తర్వాత ఆయాగ్రూపుల పొదుపును బట్టి ప్రభుత్వం మ్యాచింగ్ గ్రాంట్ ఇస్తోందని, ఈ వ్యవధిని సం. నుంచి 6నెలలకు కుదిస్తే ఎలా ఉంటుందో ఆలోచించి తెలియజేయాలని టెలికాన్ఫరెన్సులో ముఖ్యమంత్రి కలెక్టర్లను కోరారు. అయితే ప్రభుత్వ మిచ్చే డబ్బు కోసం డ్వాక్రా గ్రూపులు ఏర్పడే ప్రమాదకర పరిస్థితి తలెత్తకూడదని స్పష్టంచేశారు. దీనిపై కలెక్టరు నిస్సంకోచంగా తమ అభిప్రాయాలను తెలియజేయాని కోరారు. కేంద్ర ప్రభుత్వం నాబార్డు ద్వారా 50వేలు స్వయం సహాయంగ్రూపులకు సహాయంవందిచాలని నిర్ణయించిందని వీటిలో 25వేల గ్రూపులదాకా రాష్ట్రానికి వచ్చే అవకాశం ఉందని ముఖ్యమంత్రి అన్నారు.

రాష్ట్రంలో జాయింట్ ఫారెస్ట్ మేనేజ్‌మెంట్‌ల పనితీరు ఆగ్నేయాసియాలోనే అద్భుతంగా ఉన్నట్లు ప్రపంచ బ్యాంకు పేర్కొందని మన కృషికి లభించిన గుర్తింపిది, ఇంకా బాగా చేయాలి వనసంరక్షణ సమితులకు నాబార్డ్ ద్వారా ఆర్థిక వనరులను సమీకరించాలని ప్రయత్నాలు జరుగుతున్నాయని రూ.50/-దాకా రాబట్టాలని చూస్తున్నామని అన్నారు. వాటర్ షెడ్ కమిటీల్లో మహిళలకు మూడవ వంతు రిజర్వేషన్లను అమలు చేస్తున్నట్లు కర్నూలు జిల్లా కలెక్టరు చెప్పగా సి.ఎం. సంతోషం వ్యక్తం చేశారు.

ఉప్పు వాటర్ షెడ్ ప్రాంతాల్లో పంటల మార్పిడి పద్ధతిని ప్రోత్సహించాల్సిన పరిస్థితులు ఏర్పడినవి. ఆదిలాబాద్ జిల్లా కలెక్టర్ తమ జిల్లాలో లేక భవన నిర్మాణ పనులలో జాప్యం జరుగుతోంది. మూడు నాలుగు సి.ఎం..వై. గ్రూపులను గుర్తించి ఈ పనిని వారికి అప్పగించాలి. దీని వల్ల వారికి చక్కటి ఉపాధి కల్పించినట్లవుతుంది. సి.ఎం.ఇ.వై. గ్రూపుల వారెవరూ స్పందించకపోతే ఏటీఓలకు అప్పగించమని ఆదేశించారు. అప్పటికీ ఎవరూ ముందుకు రాకుంటే సెంటరింగ్ మెటిరియల్‌ను కొనుగోలు చేయాలి.



సమాన పారితోషిక చట్టం మేరకు మహిళలకు ప్రభుత్వ, ప్రైవేటు సంస్థల్లో వ్యవసాయ మహిళా కార్మికులకు సమాన వేతనాలిచ్చే విధంగా చర్యలు, మహిళా జన్మభూమి తదనంతర చర్యలపై వివిధ శాఖ సీనియర్ ఐ.ఎ.ఎస్. అధికారులు శాఖాధిపతులతో ముఖ్యమంత్రి ఉన్నతస్థాయి సమీక్షా సమావేశం నిర్వహించారు. ప్రతి శాఖలో మహిళలకు అందించే కార్యక్రమాలకై స్వల్పకాలిక ప్రణాళిక మరో దీర్ఘకాలిక ప్రణాళికలు సిద్ధంచేసి వెంటనే అమలుకు చర్యలు తీసుకోవాలని ముఖ్యమంత్రి అన్నారు. శాఖలుసాధ్యాసాధ్యాలను క్షుణ్ణంగా జేరీజు వేసి ప్రణాళిక రూపొందిచాక వెనక్కుతగ్గడమనే ప్రసక్తి ఉండరాదని అన్నారు. మహిళలకు సమాన అవకాశాలు కల్పిస్తే అన్ని రంగాల్లో మగవారితో పోటీ పడగలరని ఇటీవల హైద్రాబాద్‌లో నిర్వహించిన డ్వాక్రా బజార్ నిరూపించిందని చంద్రబాబు గుర్తు చేశారు.

మహిళలకు సమాన హక్కులతోపాటు సమాన అవకాశాలు సమాన వేతనాలు యిప్పించడానికి స్పష్టమైన నిర్ణయాలు తీసుకోవాలని కార్మికశాఖ అధికారులను ఆదేశించారు. యిప్పుడున్న చట్టాల్లో అవసరమైన సవరణలు తెచ్చి పటిష్టంగా అమలు చేయాలని ఆదేశించారు. మహిళలపై అత్యాచారాలు, నేరాలు పెరుగుతున్న విషయమై ఆందోళన వ్యక్తం చేస్తూ దీన్ని నిరోదించడానికి కూడా అవసరమైతే చట్టాలు సవరించాలన్నారు. ఈవ్‌టీజింగ్ అరికట్టడానికి ప్రస్తుతం పట్టణాలకే పరిమితమైన చట్టాన్ని రాష్ట్ర వ్యాప్తంగా అమలు చేయడానికి ఆర్డినెన్స్ జారి చేయడానికి అవసరమైన చర్యలు తీసుకోవాలని హోంశాఖను ఆదేశించారు. మహిళలపై అత్యాచారాలు తగ్గించడానికి, స్త్రీల పట్ల పెరుగుతున్న నేరాలను నిరోదించడానికి అవసరమైన చర్యలు తీసుకునే వీలుగా ప్రతిపాదనలు రూపొందించి తెస్తే సాధ్యమైనంత తొందరగా వాటికి చట్టబద్ధత కల్గించడానికి చర్యలు తీసుకుంటామన్నారు. మహిళా రక్షణ విభాగాన్ని బలోపేతం చేయడంతో పాటు ప్రస్తుతం రాష్ట్రవ్యాప్తంగా ఉన్న ఆరు ఫ్యామిలీ కోర్టులు, రెండు మహిళా కోర్టుల సంఖ్యను పెంచే విధంగా చర్యలు తీసుకుంటామన్నారు. మహిళాల హక్కులు మహిళల అవకాశాలు కాపాడడానికి జాతీయ కమీషన్ యిటీవల చేసిన సిఫారస్సులు పరిశీలించి అమలు చేయడానికి వీలుగా ప్రతిపాదనలు రూపొందించాల్సిందిగా ఆదేశించారు. పోలీసు శాఖ పరిధిలోని మహిళా శిక్షణ విభాగాన్ని రాష్ట్ర మహిళా కమీషన్‌కు అప్పగిస్తే ఒనగూరే ప్రయోజనాలు పరిశీలంచాల్సిందిగాను ఆస్తిలో హక్కు వినియోగించడానికి యిప్పుడున్న పరిస్థితులకు పరిష్కారం

ఆలోచించి సరైన నిర్ణయం తీసుకునే విధంగా సూచనలు యివ్వాలని కోరారు. మహిళలకు ప్రయోజనం చేకుర్చే ప్రతీ అంశంతో పాటు వారి హక్కులు, అవకాశాలు కాపాడడానికి ప్రభుత్వం తీసుకునే చర్యలకు పూర్తి చట్టబద్దత ఉండడానికి న్యాయశాఖ సలహాలు తీసుకోవాలని, మహిళల ఆరోగ్యాన్ని సంరక్షించడానికి 10లక్షల మందికి వంటగ్యాస్ కనెక్షన్ అందించే విషయంలో వెనక్కు తగ్గేది లేదని సబ్సిడీలపై 10 లక్షల వంటగ్యాస్ కనెక్షన్లు యివ్వడానికి 10కోట్ల రూ. అవసరమౌతుందని ప్రైవేటు ఎల్.పి.జి. కంపెనీలు మూడు నెలల్లో 10 లక్షల గ్యాస్ కనెక్షన్లు యివ్వాడానికి సంసిద్ధత వ్యక్తం చేశామన్నారు. గ్యాస్‌పై వంట చేయడం వల్ల మహిళల ఆరోగ్యం బాగుండటయేగాక అడవులపైన ఒత్తిడితగ్గి పర్యావరణ పరిస్థితులు చక్కబడతాయని దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న మహిళలకు ఆరోగ్య భీమా పథకాన్ని వర్తింపజేసే ప్రతిపాదనలు రూపొందిస్తున్నట్లు సుమారు కోటిమంది మహిళలకు ఈ ఆరోగ్యభీమా పథకాన్ని అమలుచేసే అవకాశం ఉంటుందని, దీని వల్ల లక్షల రూపాయలు ఖర్చయ్యే సూపర్ స్పెషాలిటీ వైద్య సేవలు సైతం బడుగువర్గాలకు అందించే అన్నీ ప్రయోజనాలను ఇకపై కుటుంబాల్లోని మహిళల పేరుపై మాత్రమే యివ్వాలని, యిందుకు అవసరమైన ఉత్తర్వులు వెంటనే జారీ చేయాలని సంబంధిత శాఖల అధికారులను ముఖ్యమంత్రి కోరారు.



ప్రతీ గ్రామం, ప్రతీ వార్డు స్థాయిలో ఈ కార్యక్రమం కోసం

స్పష్టమైన కార్యాచరణ ప్రణాళికలు సిద్ధం చెసుకుంటున్నారు. మండల స్థాయిలో అన్నీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులు, కాలేజీల ప్రధాన అధ్యాపకులు, సమయం సహాయ గ్రూపులు స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులతో సమావేశాలు నిర్వహించి పచ్చదనం - పరిశుభ్రం కార్యక్రమాన్ని రూపొందించుకుంటారు. వర్షపునీరు భూమిలోకి వెళ్లేందుకు వీలుగా వాటర్ హెర్వేస్టింగ్ ప్రక్రియను కూడా రాష్ట్రవ్యాప్తంగా విస్తృత స్థాయిలో పాటించాలని మార్గదర్శకాలు జారీ చేసినట్లు వాటర్ హ్వార్వెస్టింగ్ పట్ల ప్రజలకు అవగాహన కల్గించి విస్తృతంగా చేపట్టడానికి వీలుగా జిల్లాస్థాయిలో సెమినార్లు నిర్వహించాలని ముఖ్యమంత్రి అన్నారు. కోడింగ్ పద్ధతి ప్రవేశ పెట్టడానికి ముఖ్యమంత్రి చంద్రబాబు కూడా గ్రీన్ సిగ్నల్ యివ్వడంతో నాసిరకం పురుగుమందుల తయారీదారుల ఆటకట్టే అవకాశముందని భావిస్తున్నారు. రాష్ట్రంలో మొదటి సారిగా అనుసరిస్తున్న ఈ పద్ధతి అమలుకు హైద్రాబాద్‌లో ఒక ప్రయోగశాలను ఏర్పాటు చేయడానికి కూడా ముఖ్యమంత్రి ఆమోదం తెలిపారు. దేశంలో ఎక్కడాలేని విధంగా రాష్ట్రంలో తొమ్మిది వేల మెట్రిక్ టన్నులకుపైగా పురుగుమందులను కొన్ని కంపెనీలు నాసిరకం మందులను రైతులు వాడుతున్నారు. భారీ ఎత్తున పురుగుమందులను వాడుతుండడంతో కొన్ని కంపెనీలు నాసిరకం మందులను కూడా మార్కెట్టులోకి విడుదల చేస్తున్నాయి. నాణ్యమైన పురుగుమందులు సరఫరా అయ్యేటట్లు చూడడంలో భాగంగానే 13 వందలకు పైగా ఇన్‌స్పెక్టిసైజల్ ఇన్‌స్పెక్టర్లను నియమించడంతో పాటు శాంపిల్స్ విశ్లేషణకు నాలుగు

ప్రయోగశాలలను ఏర్పాటు చేసింది. ఇంతవరకూ బాగానే ఉన్నా కంచే చేనుమేసిందనట్లుగా ప్రయేగశాలల్లోని సిబ్బంది కంపెనీలతో లోపాయికారి అవగాహన కుదుర్చుకుంటుండటం ప్రభుత్వ ఆశయం నీరుకారుతోంది. వ్యవసాయ శాఖ యిటీవలి నిర్వహించిన పరిశీలనలో దాదాపు 89 కంపెనీలకు పురుగుమందులను ఉత్పత్తి చేసే కనీస వసతులుకాడా లేవనే పురుగుమందులు శ్యాంపి విశ్లేషణలో మాత్రం 2% కూడా నాసిరకం పురుగుమందులు ఉండటం లేదు. ఇన్స్పెక్టిసైడ్ ఇన్స్పెక్టర్లు ఆయా మందుల శాంపిల్స్ తీసుకొని ప్రయోగశాలలకు పంపిస్తారు. ప్రభుత్వం హైద్రాబాద్లోని రాజేంద్ర నగర్, గుంటూరు, అనంతవరం, తాడెపల్లి గూడెంలో నాలుగు ప్రయోగశాలలు ఉన్నాయి. వీటిలో 8,500 శాంపిల్స్‌ను విశ్లేషించవచ్చు. వరంగల్‌లో మరో ప్రయోగశాలను ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం అనుమతి యిచ్చింది. ఇన్స్పెక్టిసైడ్ ఇనస్పెక్టర్ శాంపిల్ తీసిన తరువాత ఆ పురుగుమందు తయారీ దారి పేరు బ్యాచ్‌నెంబరు తదితర వివరాలను లేబుల్‌పైరాసి ప్రయోగశాలలోని సిబ్బంది విశ్లేషణకు ముందు ఆయా కంపెనీదారులతో లాలూచీ పడుతున్నారు. దీనివల్లనే నాసిరకం పురుగుమందు కూడా నాణ్యమైనదిగా వచ్చేస్తోంది. ఈ లాలూచీ వ్యవహారాన్ని ఏవిధంగా అరికట్టాలనే విషయమ్మై వ్యవసాయశాఖ కమీషనర్ అజయ్‌కల్లం ఆలోచించి ప్రభుత్వానికి ఒక నివేదికను పంపిచ్చారు. ఈ నివేదికను పరిశీలించిన ముఖ్యమంత్రి దానికి ఆమోదముద్ర వేశారు. ఇందుకు అనుగుణంగా హైద్రాబాద్‌లో కోడింగ్ ఒక ప్రయోగశాలను ఏర్పాటు చేస్తారు. పురుగుమందు శాంపిల్స్‌ను సేకరించిన ఇన్స్పెక్టిసైడ్

ఇన్‌స్పెక్టర్లు వాటిని హైదరాబాద్‌లోని కోడింగ్ ఇచ్చే ప్రయోగశాలకు పంపిస్తారు. ఈ ప్రయోగశాలలో పని చేసే కోడింగ్ అధికారి ఆ శాంపిల్స్‌ను వేరే వాటిలోకి మార్చి అవి ఏ కంపెనీ అనే విషయం తెలియకుండా ఒక సీక్రెట్ కోడ్ యిచ్చి విశ్లేషణకు పంపిస్తారు. దీనివల్ల ఆ శాంపిల్ ఆ కంపెనీది అనే విషయం విశ్లేషణ చేసేవారికి తెలియదు. విశ్లేషణఫలితాలను తిరిగి హైద్రాబాద్ పంపించాలి. కోడింగ్ యిచ్చిన అధికారి దాన్ని రీకోడ్ చేస్తే తప్ప అది ఎ కంపెనీది అనే విషయం తెలియదు. ఈ పద్ధతిని అనుసరించడం ద్వారా అవినీతిని అరికట్టవచ్చని ఆశిస్తున్నారు.



కేంద్రానికి ప్రభుత్వ సిఫార్సు మహిళలపై మానభంగాలు జరిపే నేరస్తులకు ఉరిశిక్ష విదించాలని తమ ప్రభుత్వం భావిస్తుంది. చట్టం చేసే విధంగా కేంద్రప్రభుత్వంపై వత్తిడి తీసుకువస్తామని ఈ సంకల్పానికి మహిళలందరూ మద్దతుయివ్వాలని చంద్రబాబు కోరారు. మహిళలపై, పసిపిల్లలపై, మానబంగాలు చేసేవారిని అదుపులో పెట్టాలంటే మరణ శిక్ష వేయాలని ముఖ్యమంత్రి చెప్పారు. ఏగ్రామంలో ఏ మహిళకు అన్యాయం జరిగిన మీకు అన్యాయం జరిగిట్లు భావించి తిరుగుబాటు చేయండి. మీతో నేను ఉంటాను. మా ప్రభుత్వం ఉంటుంది. ఎవరు చేడు చేసిన వారికి బుద్ధిచెబుదాం అని ముఖ్యమంత్రి అన్నారు. ప్రభుత్వ సంస్థల ద్వారా ఇచ్చే రుణాల్లో 50 శాతం రుణాలకు మహిళలకే ఇవ్వాలని నిర్ణయించినట్లు ఇటీవల రాష్ట్రపతిని ఆయన భార్యను ఒక సమావేశంలో కలిసినప్పుడు మీ రాష్ట్రంలో మహిళా ఉద్యమం

జరుగుతుందని తాము విన్నామని ఇది భారతదేశానికే ఆదర్శం కాగలదని వారు అభినందించినట్లు చెప్పారు. మగవారితో సమానంగా మహిళలకు వేతనాలు ఇవ్వాలని అన్ని శాఖలను ఆదేశించినట్లు చెప్పారు.

## శ్రమిస్తే మెరుగైన జీతాలు

శ్రమ సంస్కృతిని అలవరకచుకుని రాష్ట్రప్రభుత్వోద్యోగుల తమ విధులను నిర్వరిస్తే సెంట్రల్ పేస్కేళ్లకంటే మెరుగైన జీతాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నామని ముఖ్యమంత్రి యన్. చంద్రబాబు నాయుడు హామీ ఇచ్చారు. 4 ఏళ్ళ క్రితం ఉద్యోగులకు జీతాలు కూడా ఇవ్వలేని పరిస్థితుల్లో ఉన్న రాష్ట్రప్రభుత్వం నేడు సమిష్ఠి కృషితో విశ్వసనీయతను పెంపొందించుకుని సుస్థిరత దిశగా ముందుకు వెళుతుందని చెప్పారు. గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల అమల్లో కీలకపాత్ర వహిస్తున్న వి.డి.ఒ.ల సమస్యలను సాధ్యమైనంత త్వరలో పరిష్కరించేందుకు అన్నిరకాల చర్యలు తీసుకుంటాను. కష్టపడిపని చేసేవారికి తమ ప్రభుత్వం అన్ని విధాలచేయూతనిస్తుంది. సాగునీటి సంఘాలను విదేశాల్లో కూడా ఏర్పాటు చేసేందుకు అక్కడి ప్రభుత్వాలు ఆసక్తి చూపుతున్నాయన్నారు. గత ఏడాది ఈ సంఘాల ద్వారా రూ.40కోట్లు ఖర్చుచేయాగా ఈ ఏడాది రు.300 కోట్లు వ్యయం చేయదలచామని తెలిపారు. విధ్య, ఆరోగ్యం, గ్రామిణ మౌలిక సదుపాయాల కల్పన ప్రభుత్వం అత్యదిక ప్రాదాన్యం ఇస్తోంది. విశ్వసనీయతను బట్టి అప్పు పుడుతుందని చెపుతూ ఆంధ్రప్రదేశ్ అందుకు అనువైన ప్రదేశంగా మారిందని చంద్రబాబు అన్నారు. గ్రామీణ ప్రజలకు

అందుబాటులో ఉండే వి.డి.ఒ.లు ప్రభుత్వ కార్యక్రమాలను సక్రమంగా అమలు చేసినప్పుడే ప్రజలకు గౌరవం కలుగుతుంది. రాష్ట్ర ప్రభుత్వం ప్రకటిస్తున్న కొత్త పథకాలు కార్యక్రమాలనియమ, నిబంధనలు సరిగారూపొందిస్తేవాటిని పగడ్బందీగా అమలు చేసేందుకు వీలుకలుగుతుంది. వి.డి.ఒ.ల సర్వీస్ రూల్స్‌పై ప్రభుత్వం ప్రత్యేక దృష్టి నిలపాలి.

### ముందడుగు

జగ్జీవన్‌రామ్ జయంతిని పురస్కరించుకుని షెడ్యూల్డ్ కులాల (ఎస్సీ) వారి అభ్యున్నతికోసం రాష్ట్రప్రభుత్వం ముందడుగు పేరిట ప్రత్యేక ప్యాకేజీ ప్రకటించింది. మెస్ చార్జీలు పెంపు స్కాలర్ షిప్‌ల పెంపు వంటి కీలక మైన నిర్ణయాలను తీసుకుంది.

రాష్ట్రంలో 25 లక్షల ఎస్సీ కుటుంబాలుండగా ముందడుగు ద్వారా 11.50 లక్షల కుటుంబాలకు ప్రభుత్వ పరంగా సాయంవందించాలని భావిస్తున్నట్లుచెప్పారు. లక్షన్నర కుటుంబాలకు ఇళ్లజాగాలు, మరో లక్షన్నర మందికి పక్కా గృహాలు కేటాయించాలని ప్రభుత్వం భావిస్తోంది. అలాగే మైనర్ ఇరిగేషన్ కింద 75 వేలమందికి స్వయం సహాయ గ్రూపుల కింద లక్షమందికి భూమి అభివృద్ధి ద్వారా 25 వేల మందికి డ్వాక్రా ద్వారా 2 లక్షల కుటుంబాలకు సహాయమందిచాలని ప్రభుత్వం యోచిస్తోంది. శానిటేషన్ పథకం కింద 2 లక్షల మందికి ఐ.ఆర్.డి.పీ. కింద 50 వేల ఎస్సీ కుటుంబాలకు సహాయమందించాలని ప్రభుత్వం యోచిస్తోంది. శానిటేషన్ పథకం

కింద రెండు లక్షల మందికి ఐ.ఆర్.డి.పి. కింద వృద్ధాప్య వితంతు పెన్షన్లద్వారా 75 వేలమందికి గర్ల్‌చైల్డ్ ప్రొటెక్షన్ స్కీమ్ ద్వారా 20 వేల మందికి లబ్ధి చేకూర్చాలని ముఖ్యమంత్రి చెప్పారు. సామాజిక అసమానతలను రూపుమాపేందుకు కృషిచేసిన బాబు జగ్జీవన్‌రావ్ బాబాసాహెబ్ అంబేద్కర్ జయంతులు ఒకే నెలలో వచ్చాయి. సమాజంలో ఎస్సీల పరిస్థితిని మెరుగు పరచడానికి తెలుగుదేశం ప్రభుత్వం కృతనిశ్చయంతోవుంది. వారికి విద్యావసతి, స్వయంపాధి, కల్పించడం ద్వారా వారిస్థితిగతులను మెరుగు పరచవచ్చని ప్రభుత్వం విశ్వశిస్తోంది. భాగంగానే "ముందడుగు' మసాయిదాను రూపొందించామని చెప్పారు. గత సం. సాంఘిక సంక్షేమశాఖ బడ్జెట్ 324 కోట్లరూపాయలు గాకా ఈ సం.471కోట్లకు పెంచామని అవసరమైతే వనరులను సమీకరించి అదనంగా వందకోట్లకు పైగా ఖర్చు చేయడానికి ప్రభుత్వం ఇప్పటి వరకు సంక్షేమ హాస్టళ్ళలో వసతి పొందుతున్న విద్యార్థులకు నెలకు రూ. 230 చొప్పున మెస్ చార్జీలు కేటాంస్తుండగా ఇప్పుడుప్రభుత్వం తీసుకున్న నిర్ణయం వల్ల వచ్చే విద్యా సం. నుంచి 3 నుంచి 7 తరగతి చదివే విద్యార్థులకు 270 రు. ఎనిమిది నుంచి పదో తరగతి వరకూ చదివే విద్యార్థులకు రు.330 కేటాయిస్తారు. దీనివల్ల 6,32,189 మందికి లబ్ధిచేకూరుతుందని ప్రభుత్వం పై 41.39కోట్ల రూపాయలు అదనపు భారం పడుతుంది. అలాగే ఎస్సీ విద్యార్థులకిచ్చే పోస్ట్‌మెట్రిక్ స్కాలర్ షిప్‌లను కూడా పెంచారు. ఈపెంపుదల ఇప్పుడొస్తున్న దానిపై 25% అధికం. ఈ పెంపుదల కూడా వచ్చే విద్యా సం. నుంచి అమల్లోకి వస్తుంది. పోస్ట్ మెట్రిక్ స్కాలర్ షిప్‌లపై ప్రభుత్వం ఏటా 55.09కోట్లు రూపాయలు వెచ్చిస్తోంది. ఇప్పుడుప్రకటించిన

పెంపుదల వల్ల అదనంగా రు.13.79 కోట్లు భారం పడుతుంది. హాస్టల్ విద్యార్థులకిచ్చే కాస్మొటిక్ చార్జీలను కూడా పెంచుతున్నామని ఇకపై బాలికలకు 2 నెలలకు 25రు. చొప్పున బాలురకు రూ 20 చొప్పున ఇస్తామని దీనిపై కూడా రు. 26 కోట్లు ఖజానానుంచి అదనంగా చెల్లించాల్సి ఉంటుదని రూ. 2 కోట్లుకు పైగా ఖర్చు చేసికాలేజీలో చదివే విద్యార్థుల వసతికోసం 50 ప్రత్యేక హాస్టల్ లు ఏర్పాటు చేస్తున్నట్లు ముఖ్యమంత్రి చెప్పారు. చదువు బాటలో లేని బాలికలకు దీర్ఘకాలిక బ్రిడ్జి కోర్సు నిర్వహించాలని ప్రభుత్వం భావిస్తోంది. ఇందుకోసం డి.పి.ఐ.పి. అమలువుతున్న అనంతపురం, చిత్తూరు, శ్రీకాకుళం, విజయనగరం, అదిలాబాద్, మహబూబ్ నగర్‌లలో రెండేసి రెసిడెన్సియల్ స్కూళ్ళను ఏర్పాటు చేస్తారు. ఇవే జిల్లాల్లో మరో పన్నెండు రెగ్యులర్ రెసిడెన్సియల్ పాఠశాలలను ప్రారంభిస్తాము. వీటితో బాటుగా తక్కిన పది హేడు జిల్లాలో బాలికలకు దీర్ఘకాలిక బ్రిడ్జి కోర్సులకోసం రెసిడెన్షియల్ స్కూళ్ల ఏరాటు చేస్తాము. ప్రతి జిల్లాలో రెండేసి రెసిడెన్సియల్ స్కూళ్ళగా మార్పు చేస్తాము. రాష్ట్రంలోని ఆరు జోన్లలో పన్నెండు రెసిడెన్సియల్‌పాఠశాలలో లాంగ్ టెర్మ్ ఎమ్‌సెట్ కోటింగ్ ఇవ్వాలి. సివిల్స్ పరిక్షల్లో శిక్షణ ఇచ్చే ఆంధ్రప్రదేశ్ స్టడీసర్కిల్ శాఖలను గుంటూరు, తిరుపతి, అనంతపురం, వరంగల్లులో ఏర్పాటు చేయగలము. ఆర్నెల్లలో అధికారులు కనెక్షన్లు ఇస్తారని ముఖ్యమంత్రి తెలిపారు. రూ. 75 లక్షల వయ్యంతో నిర్మించనున్న బాబుజగ్జీవన్‌రాయ్ భవనానికి సి.ఎం. శంకుస్థాపన చేశారు. ముఖ్యమంత్రి "ముందడుగు' పథకం గురించి ప్రస్తావిస్తారు. "ఆదరణ'పథకం ఎంతో మంది ఆర్థిక పరిస్థితిని

మెరుగుపరచినందువల్ల "ముందడుగు'పథకాన్ని కూడా పటిష్ఠంగా అమలు చేసేందుకు చర్యలు తీసుకుంటున్నాము. ఈ పథకాన్ని పదిరోజులకోసారి పర్యవేక్షిస్తూ ప్రత్యేక శ్రద్ధ చూపుతామన్నారు. ఎస్సీ మహిళల్లో విద్యావకాశాలను మెరుగుపరిచేందుకు "మళ్ళీ బడికి' పథకాన్ని పగడ్బందీగా అమలు చేస్తున్నాము. నిరక్షరాస్యులైన ఎస్సీ మహిళలు డ్వాక్రా సంఘాలుగా ఏర్పడి పొదుపులో ప్రధాన పాత్ర పోషిస్తున్నారు.వేదింపులు, ఆరాచకాలు, అఘాయిత్యాలకు గురైన దళితులకిచ్చే పరికరాన్ని 2 లక్షలకు పెంచాము. దళితుల కేసులు సత్వర పరిష్కారానికి ప్రత్యేక కోర్టులు ఏర్పాటు చేశాము. రిజర్వేషన్లు వ్యతిరేకించే వారిని కఠినంగా శిక్షించేందుకు చట్టం తీసుకొచ్చాము. 1998-99 లో 38 కొత్త రెసిడెన్షియల్ స్కూళ్ళను ప్రారంభించాము. 104 స్కూళ్ళను జూనియర్ కాళాశాలల స్థాయికి పెంచాము. మునుపెన్నడూలేని విధంగా నాలుగు నెలల్లో 6 లక్షల 14 వేల మందికి ఇళ్ళ స్థలాలు ఇచ్చాము. పేదవారికి ఇళ్ళు నిర్మించే విషయంపై ప్రభుత్వం శ్రద్ధ చూపిస్తుంది. బాలికలు సంక్షేమం కోసం 33 వసతి గృహాలను ఏర్పాటు చేశాము. 7 కోట్ల రూపాయలతో అన్ని సంక్షేమ హాస్టళ్ళకు మరమ్మత్తులు చేయించాము. సాంఘిక సంక్షేమ శాఖ బడ్జెట్‌ను 324 కోట్ల రూపాయలకు పెంచాము. కంప్యూటర్ విద్యపై విద్యార్థులకు పట్టు కల్పించేందుకు ప్రత్యేక కోర్సులను ప్రారంభించాము. వాటిల్లో 2,500 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతున్నారు. ప్రస్తుతం ఇంగ్లీషు బాష అన్ని విషయాల్లోనూ కీలక పాత్ర పోషిస్తున్నందువల్ల రెసిడెన్షియల్ స్కూళ్ళలో ఇంగ్లీషు మీడియంను ప్రారంభించాము. బి.సి.ఎ. కోర్సును ప్రారంభించి విద్యార్థులను ప్రోత్సహిస్తున్నాము. 5,10 సం. లలో సంపూర్ణ

అక్షరాస్యత సాధిస్తే తప్ప ప్రగతి సాధించలేము సరూర్ నగర్‌లో ఒక ఎకరం స్థలంలో 500 మందికి సరిపోయే విధంగా నిర్మించ తలపెట్టిన బాబూజగ్జీవన్‌రావ్ భవనాన్ని పూర్తి చేయాలి. అట్టడుగుస్థానంలో ఉన్న దళితులను ఆదుకునేందుకు రాష్ట్రప్రభుత్వం సిద్ధంగా ఉంది. స్వాతంత్ర్యం వచ్చి 50సంవత్సరాలు గడుస్తునప్పటికి కొన్ని గ్రామాలలో అంటరానితనాన్ని పాటించడం హేయమైన చర్య. దళితుల సంక్షేమంకోసం ప్రభుత్వాలు అనేక సంక్షేమ పథకాలను అమలు చేస్తున్నా ఇప్పటు వరకు ఆశించిన ఫలితాలు సాధించలేక పోయాయి. ఈ సందర్భంగా పదకొండు నుంచి 18సం. రాల మధ్య వయస్సు గల బాలకలకు బ్రిడ్జి కోర్సు నిర్వణకుగాను రంగారెడ్డి జిల్లా అధికారులు తయారు చేసిన పుస్తకాలను, విధ్యను ప్రోత్సహించే దిశగా ప్రజలను చేతన్య పరిచేందుకు రూపొందిన శారధ అనే వీడియో క్యాసెట్‌ను ముఖ్యమంత్రి విడుదలజేశారు.



పేదప్రజల అభ్యున్నతికోసమే ప్రపంచ బ్యాంకు నుండి తెస్తున్నరుణం ఉపయేగిస్తున్నామని ఈ రుణంపై ప్రజలలోఅపార్థాలు సృష్టించేందుకు కొన్ని పార్టీలు ప్రయత్నిస్తున్నాయని, దీనిపై ఎవరు తప్పు చేసింది ప్రజాకోర్టులోనే తెలుస్తుంది. సహాయ గ్రూపుల పథకాలకు నిధుల కొరత లేదు. మళ్లీ బడికి కార్యక్రమంలో పాల్గొని చదువు చెప్పే కళాశాల విద్యార్థులకు ఆయా సబ్జెక్టులలో గ్రేస్ మార్కులు ఇచ్చే విషయాన్ని పరిశీలిస్తున్నాము. ప్రపంచ బ్యాంకు రుణాలు తీసుకోవడంలో రాష్ట్ర ప్రయోజనాలను ఎక్కడ దెబ్బతీసేవిదంగా వ్యవహరించలేదు. ఎ.పి.ఇ.ఆర్.పి. కింద తెస్తున్న రుణానికి ఐదుశాతం వడ్డీనే

పడుతుంది. కేంద్రప్రతిపాధిత పధకాల క్రింద 1320 కోట్ల రూపాయలు గ్రాట్లు లభిస్తుంది. ఇతర రాష్ట్రాలు 14.15 శాతం వడ్డీకి అప్పులు తేస్తున్నా ఈ విషయాలను ప్రజలకుతెలియజేప్పాల్సిన అవసరం వుంది. ఎవరు తప్పు చేసింది. ప్రజలకు తేలుస్తుంది. ఐసి.డి.యస్. కింద పేదలకు పౌష్ఠికాహారం ఇవ్వటం ఎలా తప్పుఅవుతుంది. ప్రపంచ బ్యాంకు రుణాలతో స్కూళ్ళు, బిల్డింగులు, ప్రాధమిక ఆరోగ్య భవనాలు కట్టడమే తప్ప నీటి పారుదల వ్యవస్థ వేరుగుదలకు 1000 కోట్లు ఖర్చు పెడుతున్నాం. మారుమూల ప్రాంతాల అభివృద్ధికోసం జిల్లా 100 కోట్లరూపాయల చోప్పున వ్యయం చేశాము. మిగిలిన రహదారుల మరమ్మత్తులకు 600 కోట్లు కేటాయించాము. ఈ కార్యక్రమాల వల్ల లబ్ధిపొందుతున్నవారిలో చైతన్యం తేవాలని ప్రజల కోర్టులోనే అన్ని తేలుస్తాయని ప్రపంచ బ్యాంకు రుణానికి సంభందించిన పత్రాలను శాసన సభలో ఉంచటానికి ఎప్పుడూ అభ్యతరం లేదు. కొద్దిరోజుల క్రితం సభలో ఈ అంశం ప్రస్తావనకు వచ్చినప్పడు తాను వేరేచోట కార్యక్రమాలలో ఉన్నదున పత్రాల వేల్లడి ప్రకటన చేయడంలో కొంత జాప్యం జరిగిందే తప్ప మరోకటి కాదని ముఖ్యమంత్రి అన్నారు. టెండర్ల విషయంలో కూడా 15% ఎక్సెజ్ మించితే ప్రపంచబ్యాంకు ఓ.ఇ.సి.యఫ్. పనులైనా సరే టెండర్లు రద్దు చేస్తున్నాము.శాసన సభలో ఈవిడత పార్టీ ఎమ్మెల్యేల మంత్రుల పనితీరు బాగుంది. అందువల్లె ఫలితాలు మెరుగ్గా ఉన్నాయి. ఇదే స్ఫూర్తితో ఫీల్డ్ వర్క్ కూడా చేయాలి. గత ఏడాది నీటిపారుదల పనులు సజావుగా సాగడంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి 136 లక్షల టన్నుల నుంచి 146 లక్షల వరకు పెరిగింది.

## ముఖ్యమంత్రి ఆస్తులు అప్పుల వివరాలు

శ్రీ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించిన ఆస్తుల వివరాలు

1. నెల్లూరు జిల్లా నిందాలి గ్రామంలో 13.05 ఎకరాల వ్యవసాయభూమి (1985-86) లో సమకూర్చుకున్నారు. ఆర్థిక సంస్థల నుంచి తీసుకున్న అప్పులు రూ.22,69,563.
2. జూబ్లీ హిల్స్ రోడ్ నెం.65లో ఇల్లు (1985-92)
3. బంజారాహిల్స్ శ్రీ వెంకటేశ్వర సహకార హౌసింగ్ కాలనీ ఇల్లు (1980-85)
4. హెరిటేజ్ ఫుడ్స్‌లో 7,61,500 షేర్లు ఒక్కొక్కటి రూ.10విలువ గలవి (1992-93)
5. అంబాసిడర్ కారు.
6. ఇతరపెట్టుబడులు రూ.30,7,280 నగదు బ్యాంకు బ్యాలెన్స్ 1,28,361 .
7. నిందాలి గ్రామంలో రూ.13.3ఎకరాల వ్యవసాయభూమి (1986-87).
8. అన్‌లిస్టెడ్ కంపెనీల్లో 4,15,500 షేర్లు
9. ఆడ్వాన్సులు రూ.22,45,626 పన్ను రూపేణాకట్టినది. రూ.91,8,94 నగదుబ్యాంకు బ్యాలెన్స్ రూ.46,016.

### శ్రీమతి భువనేశ్వరి ఆస్తుల వివరాలు

10. నెల్లూరి జిల్లా నిందాని గ్రామంలో 10.23ఎకరాల వ్యవసాయభూమి (1987)

11. నల్గొండ జిల్లానెర్కొటు పల్లి మండలం ఎల్లారెడ్డి గూడలో 19 సెంట్లు భూమి (1995).

12. రంగారెడ్డి జిల్లా శేరిలింగంపల్లి మండలం కొత్త గూడలో 19 సెంట్లు భూమి (1995).

13. తమిళనాడు లోని శ్రీ పెరంబుదూర్ సమీపంలో చెన్నారు కుప్పంలో 2.33 ఎకరాల వ్యవసాయ భూమి.

14. హైదరాబాదు నగరశిఖరాల్లో మాదాపుర్‌లో 21 సెంట్ల భూమి (1996) .

15. వివిధ ఫైనాన్స్ కంపెనీల నుంచి తీసుకున్న అప్పులు రూ.1,46,09,436 .

16. నగరంలోని పంజాగుట్టలో ఇంకా పూర్తికాని భవనంనెం.6-3-541/సి (1995-99)

17. శేరిలింగంపల్లి మండలం కొండాపూర్ గ్రామంలోని 3-28 ఎకరాల వ్యవసాయ ఫామ్‌లో 34 శాతం వాటా

18. హెరిటేజ్ ఫుడ్స్‌తో 11,23,100 షేర్లు (1992-95) 966.7 గ్రాముల బంగారం 8 కిలోల వెండి.

19. ఇతర కంపెనీల్లో పెట్టుబడులు రూ. 28,01,100 నగదు, బ్యాంకు బ్యాలెన్స్ రూ. 7,36,930.



20. నెల్లూరు జిల్లా నిందాలిగ్రామంలో 8.91 ఎకరాల వ్యవసాయ భూమి (1987) నిందాలిలోనే మరో 42 సెంట్ల భూమి (1998).

21. కొండాపూర్‌లోని 3.276 ఎకరాల వ్యవసాయ ఫామ్‌లో 33 శాతం వాటా.

22. హెరిటేజ్ కంపెనీల్లో షేర్లు 6,25,641 బ్యాంకు బ్యాలెన్స్ రు. 1,45, 546.



పార్టీ సంస్థాగతంగా పటిష్టంగా లేకపోతే ఇవేంజి ఉన్నా ఉపయోగం ఉండదు. పార్టీకి క్రిందస్థాయిలో వ్యవస్థ ఎంతో అవసరమని దాన్ని సమర్థంగా నిర్వహించుకోవాలి. 51,48 లక్షల సభ్యత పుస్తకాలు పంపిణీకాగా ఇంత వరకు 30,67,767 రసీదులు తిరిగి వచ్చాయి. 6,08,200 సభ్యత రసీదులు ఖాళీగా వచ్చాయి. 1188 మండల కమిటీలను ఇప్పటి వరకు నియమించామని వీటిలో మహిళలు బలహీన వర్గాలకు 50 శాతం రిజర్వేషన్ ఉండాలని ఒక వేళ అలా లేని పక్షంలో కొత్త పదవులు సృష్టించి ఆ వర్గాలకు ఇవ్వాలి. 68% గ్రామస్థాయి కమిటీలు 58% బూతే కమిటీలు ఏర్పాటయ్యాయి. 4,46,138 నుంచి క్రియాశీలక సభ్యులకుగాను లక్షమందికి ఫోటో గుర్తింపు కార్డులు ఇవ్వడం కల్పించాము. ఇప్పటికి 30 వేలు సిద్ధమయ్యాయి. ప్రతి 100 మంది ఓటర్లకు ఒక క్రియాశీల సభ్యుడు ఉండాలి. ప్రతి భూత్‌కు 10 మందితో కమిటీ ఉండాలని వారందరికి గుర్తింపుకార్డులు ఏర్పాటు కావాలని అభిప్రాయం జిల్లా పార్టీ ఆఫీసులు క్రమబద్ధంగా పని చేయాలి. నియోజక వర్గంలో ఎమ్మెల్యే మండల అద్యక్షుడు జడ్.పి.టి.సి. సభ్యులు, మార్కెట్ కమిటీ చైర్మన్ ప్రభృతులుతో కూడిన నియోజక వర్గ సమన్వయ

కమిటీలు ఏర్పాటు కావాలి వారందరికి శిక్షణ ఇస్తాంభూాత్ స్థాయి. క్రియాశీల కార్యకర్తలకు రెవిన్యూ డివిజన్ స్థాయిలో శిక్షణ కేంద్రాల ద్వారా శిక్షణ ఇప్పిస్తాం. నియోజక వర్గస్థాయి సమస్యలు ఎక్కడిక్కడ పరిష్కారం కావాలి. పార్టీ మీటింగులు కూడా సజావుగా జరగాలి. అందులో చర్యల వివరాలను ఇక్కడకు పంపి కంప్యూటరైజ్ చేస్తాం. మాట్లాడే వారు, కొందరు తక్కువ పని చేస్తున్నారు. తక్కువ మాట్లాడేవారు, కొందరు బాగా పనిచేస్తున్నారు.



తెలుగు దేశం పార్టీకి ప్రజల్లో ఒక ఇమేజి ఏర్పడింది. వర్గ విబేదాలు దానిని దేబ్బతీయకుండా అందరూ జాగ్రత్త వహించాలి. అసెంబ్లీ వేదికపై మనం మన కృషిని బాగా చెప్పగలిగాం, ఆ ఊపు తగ్గకుండా ఇంకా విజృంబించి పనిచేయాలి జిల్లాలో మీరంతా ఐకమత్యంగా. ఉన్నట్లుగా కన్పించడానికి అందరూ కలిసి నియోజక వర్గాల్లో పర్యటించాలి.

అహం లేకుండా అందరికీ కలుపుకొని పని చేయాలి. చిన్నతగాదాలు అక్కడికక్కడే పరిష్కరించుకోవాలి గుంటూరు. జిల్లాలో నాయకులు విభేదాలు వీడి కలిసి తిరుగుతుండటం మంచి పలితం ఇచ్చింది. దానిని అందరూ ఆదర్శంగా తీసుకోవాలి. సోమవారం ఉదయం తాను మంత్రులు, పార్టీ జిల్లా అధ్యక్షులతో పార్టీ విషయాలు, ప్రభుత్వ అంశాలపై టెలికాన్ఫరెన్స్‌లో చర్చిస్తా ప్రతి జిల్లాలో ప్రభుత్వ పథకాల అమలు తీరును ఈ సందర్భంగా సమీక్షిస్తామని ముఖ్యమంత్రి చెప్పారు.

స్థానిక సంస్థలపై తెలుగు దేశానికి మొదటి నుంచి సంపూర్ణ విశ్వాసం ఉంది. వాటికి విస్తృతాదికారాలిచ్చి బలోపేతంచేయడానికి సర్వదాసిద్ధమే73, 74 రాజ్యాంగ సవరణను అనుసరించి స్థానిక సంస్థలకు 29 అంశాలపై అధికారులను బదలాయించాల్సి ఉండగా సర్పంచ్‌ల సంఘం ప్రతినిధులతో చర్చించిన అనంతరం ఒక అభిప్రాయానికి వచ్చి తక్షణమే పదహారింటిని ప్రభుత్వం ఆమోదించిందని తక్కిన వాటిపై ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి నేతృత్వంలోని కమిటీ పరిశీలన అనంతరం ఒక నిర్ణయం తీసుకుంటాము. వ్యవసాయం పంచాయితీల పరిధిలోని మైనర్ ఇరిగేషన్ చెరువులు గ్రామీణ తాగు, నీటి పథకాలు, చిన్న తరహా తదితర పదహారు అంశాలను పంచాయితీ రాజ్ సంస్థలకు బదలాయించినాము. ఇకపై సర్పంచ్‌లకు గౌరవ వేతనం లభిస్తుంది. మైనర్ పంచాయితీలో రూ.600 ల చొప్పునగౌరవ వేతనం చెల్లిస్తారు. ఇందుకయ్యే మొత్తంలో ఆయా పంచాయితీలు సగం మొత్తం భరిస్తే తక్కిన మొత్తాన్ని ప్రభుత్వం ఇస్తుంది. పంచాయితీల్లో సిబ్బంది పని తీరుపై ప్రత్యేక రిపోర్ట్ తయారు చేసే అధికారం సర్పంచ్‌లకు ఉంటుంది. సర్పంచ్‌లకు పూర్తి స్థాయిలో చెక్ పవర్ ఇస్తారు. సర్పంచ్ లందరికి గుర్తింపు కార్డులు జారీ చేస్తారు. ప్రతి కిలో మీటర్‌కు ఒక పాఠశాల ఉండాలనే విదానంలో భాగంగా ఎక్కడ స్కూల్ ప్రారంబించాలి. తదితర అంశాలను సర్పంచ్‌లకే వదిలేస్తారు. తలసరి గ్రాంటు రూపాయినుంచి నాలుగు రూపాయలకు పెరిగింది. ట్రెజరీల ద్వారా వేతనాల చెల్లింపు చేసే విషయాన్ని ప్రభుత్వం పరిశీలించి తర్వాత ఒక నిర్ణయం తీసుకుంటుంది. పారిశుద్ధ్య

అధికారం. ఇసుక వేలం అధికారాన్ని గనుల శాఖ నుంచి తప్పించారు. జిల్లా పరిషత్ చైర్మన్ ఒక మండల పరిషత్ కూడిన కమిటీకి దీన్ని అప్పగిస్తారు. వేలం ద్వారా వచ్చిన ఆదాయాన్ని జిల్లా పరిషత్‌కు 25%, మండల పరిషత్‌కు 37.5%, గ్రామ పంచాయి గ్రామ పంచాయితీకి 37.5% చొప్పున పంచుతారు. సర్పంచ్‌ల సంఘానికి ఎన్నిక నిర్వహించే మెజార్టీ యూనియన్ ప్రభుత్వం గుర్తించింది. రెండో రాష్ట్ర ఆర్థిక సంఘానికి స్థానిక సంస్థల నుంచి ఇద్దరు ప్రతినిధులకు సభ్యత్వం కల్పిస్తారు. మత్యకారుల ఆధీనంలో ఉన్న చెరువులను మినహాయిస్తే తక్కినవన్నీ పంచాయితీల పరిధిలోకే వస్తాయి. దీని వల్ల చేపల పెంపకానికి చెరువుల పాట పెట్టే అధికారం పంచాయితీలకు ధాఖలవుతుంది. రజకులకు ఎక్కడైతే చెరువులు కేటాయించారో అక్కడ బట్టలు ఉతుక్కోవడానికి కేటాయిస్తారు. పంచాయితీల పరిధిలోకి ఇరిగేషన్ చెరువులను అభివృద్ధి చేసే పనిని అయకట్టుదారులకే అప్పగించాలని కాంట్రాక్టర్లను వినియోగించడానికి వీల్లేదు. మైనర్ గ్రామ పంచాయితీల్లో విద్యుత్ చార్జీల విషయంలో యదాతదస్థితి కొనసాగుతుంది. సీనరేజి, వృత్తిపనుల బకాయిలను 1999-2000 సం. నుంచి 25% చొప్పున విడుదల చేస్తారు. పదో ఆర్థిక సంఘం నిధులు నేరుగా గ్రామ పంచాయితీలకే చేరతాయి. వృత్తి పన్నును ప్రభుత్వమే వసూలు చేసి పరిపాలనా ఖర్చుల కింద 5% మొత్తాన్ని మినహాయించుకుని తక్కిన మొత్తాన్ని స్థానిక సంస్థలకు ప్రతి 3 నెలలకు ఒకసారి సర్దుబాటుచేస్తోంది. ఎంటర్‌టైన్‌మెంట్ టాక్స్ తరహాలోనే కేబుల్‌టీ.వి. పన్నును కూడా స్థానిక సంస్థలకు బదలాయిస్తారు. నీటి

చార్జీలలో 10% గ్రామపంచాయితీలకు చెల్లిస్తారు. క్లీన్ అండ్ గ్రీన్ పంచాయితీలకు మౌలిక సదుపాయాలు కల్పించుకునేందుకు అవసరమైన చార్జీలలో 10% ని, గ్రామ పంచాయితీలకు చెల్లిస్తారు. క్లీన్ ఆండ్ గ్రీన్ పంచాయితీలకు మౌలిక సదుపాయాలు కల్పించుకునేందుకు అవసరమైన భూమిని గుర్తించి ఆ ప్రతిపాధనలను కలెక్టరుకు పంపిఅనుమతి పొందాల్సి ఉంటుంది. 10,00,000 లకు పైగా ఆదాయం ఉన్న పంచాయితీగా గుర్తించి వాటికి ఇచ్చే ప్రోత్సాహకాలను పెంచారు. రాష్ట్రస్థాయిలో రూ.10,000 జిల్లా స్థాయిలో 5,000 మండల స్థాయిలో2000 ఇచ్చారు.

సర్పంచులకు గౌరవవేతనం ఇస్తున్నట్టుచేసిన ప్రకటన ఫలితంగా ఏటా రూ.16.44 కోట్ల మేర ఆర్థిక వేసులుబాటు సర్పంచులకు కలిగిఉంది. రాష్ట్రంలోని 20,611 మైనర్ పంచాయితీల సర్పంచుల 1332 మేజర్ పంచాతీల సర్పంచులు ఇకనుంచి గౌరవవేతనం పొందుతారు. ప్రభుత్వం నుంచి మొత్తం రు. 8.22 కోట్లను సర్పంచులు గౌరవ వేతనం రూపంలో తీసుకుంటారు. ఇంత మొత్తం గౌరవ వేతనాన్ని సర్పంచులు పొందడం చరిత్రలో ఇదే మొదటిసారి.

జన్మభూమిలో మొత్తం 3,00,000 ల మందికి పెన్షన్లు ఇస్తున్నాం 2,00,000 ల మంది మహిళలు పలువురు వితంతువులకు వృద్ధమహిళలకు కూడా ఈ పెన్షన్లు ఇస్తారు. మిగిలిన లక్షలో 75 వేలు వృద్ధులకు 25,000 మంది వికలాంగులకు ఇవ్వాలని నిర్ణయించారు. నిర్దిష్టంగా సంఖ్యని ఖరారు చేయక పోయిన బాలికలకు ప్రత్యేకంగా కొన్ని రెసిడెన్షియల్ పాఠశాలలు మంజూరు చేయాలని కూడా మంత్రి వర్గం సూత్రప్రాయంగా నిర్ణయించింది.

ఖాళీగా ఉన్న టీచర్ పోస్టుల భర్తీకి మళ్ళీ నోటిఫికేషన్ జారి చేస్తారు. రాష్ట్రంలో విధ్యుత్ సరఫరా పరిస్థితిని సమీక్షించిన మంత్రి వర్గం ఎక్కడైనా సమస్య ఏర్పడితే అవసరమైతే పరిశ్రమ లకు మంత్రులు తమ జిల్లాలో విద్యుత్ సరఫరా పరిస్థితిని క్రమం తప్పకుండా తనిఖీ చేసే సమస్యలు ఉంటే తమ దృష్టికి తేవాలని పట్టణ రక్షణకు ప్రదమ ప్రాదాన్యం ఇవ్వాలి లొంగిపోయిన నక్షలైట్లు పునరావాసానికి నిర్ణయించిన సౌకర్యాలను 6 నెలల్లో తప్పని సరిగా ఇచ్చేలా జిల్లా కలెక్టరుకు ఆదేశాలు జారీ చేయాలని, రాష్ట్రం నుంచి బియ్యం ఎగుమతికి మంత్రి వర్గ సమావేశం కొత్త నిబంధన విధించింది. లెమీపర్మిట్లు పొందిన మిల్లర్లు అందులో సగం బియ్యం స్థానిక మార్కెట్లో విక్రయిస్తేనే మిగిలిన సగం ఎగుమతికి అనుమతిస్తారు. ఇది కొత్త నిబంధన, మంచి బియ్యం, ఎక్కువ ఎగుమతి కాకుండా ఈ నిబంధనలు పెట్టారు. మిల్లర్లు వద్ద బియ్యం నిల్వలు ఎంత ఉన్నాయో తనిఖీ చేసి వచ్చే మంత్రి వర్గసమావేశం ముందు ఉంచాలని బియ్యం అక్రమ రావాణాను అరికట్టేందుకు చెక్ పోస్టుల వద్ద తనిఖీలు ముమ్మరంచేయాలి బ్లాక్ మార్కెటింగ్ పాల్పడే వారి పై అవసరమైతే నాసా చట్టం ప్రయోగించాలని కొత్తగా భూములు కొనుగోలు చేసి మరో 5 లక్షల ఇళ్ళపట్టాలు ఇచ్చేఅవకాశాలుపరశీలించాలి. ఎప్పటి నుంచో ఉంటున్న వారికి పొజిషన్ సర్టిఫికేట్లు ఇచ్చి కొత్తగా ఇళ్ళ స్థలాలు ఇచ్చినట్లుగా చూపిస్తున్నారని విమర్శలు రావడంతో ఈ నిర్ణయం తీసుకున్నారు. ఈ ఆర్థిక సం లో ఇవ్వాలని నిర్ణయించిన 5,00000ల పట్టాల్లో ఇప్పటికి 4,09 లక్షల పట్టాలు ఇచ్చినట్లు మంత్రి సమీక్షకు అధికారులు అందజేసిన నివేదిక వెల్లడించింది.

జన్మ భూమి తదితర కార్యక్రమాలకు ముఖ్యులువచ్చినప్పుడు, ఎక్కడైనాప్రసంగిచడానికి వీలుగా రూ/-20,000 విలువజేసే అధునాతన మైక్‌సెట్టును ప్రతి రెవిన్యూ డివిజన్ కు ఒకటి సరఫరా చేయాలని నిర్ణయించారు. ఇక నుంచి జన్మభూమి క్రార్యక్రమాలను సర్పంచుల ఆద్వర్యంలో నిర్ణయించాలని నిర్ణయం తీసుకున్నారు. గ్రామీణ మంచి నీటి సరఫరా పధకాలు పూర్తికి ఇంకా రూ/-137 కోట్లు అవసరం ఉందని, నష్టాల్లో ఉన్న సహకార స్పిన్నింగ్ మిల్లులోని కార్మికులకు స్వంచ్ఛంద పదవీ విరమణ పథకం అమలు చేయడానికి నిర్దిష్ట కాలవ్యవధి కార్యక్రమం అమలు చేయాలి. హైదరాబాద్ నగరంలోని బంజారాహిల్స్ నెంబరు 12 రోడ్డు లో నిర్మించ తలపెట్టిన 26మంత్రుల నివాస భవానాలను పూర్తిచేయాలి.

విజన్-2020 డాక్యుమెంటును అనేక సదస్సుల్లో పలువురు ప్రముఖులు ప్రశంశించారు. అభివద్ధి చెందిన దేశాలకు దీటుగా రాష్ట్రాన్ని ముందుకునడిపించేదుకు చంద్రబాబు చేస్తున్న కృషికి తీసుకుంటున్న విప్లవాత్మక విద్యుత్ రంగసంస్కరణలను యావత్ దేశం ఆసక్తితో గమనిస్తోంది విద్యుత్ సంస్కరణలు తొలుత ఒరిస్సాలో ప్రారంభమైనప్పటికి అందరి దష్టి ఆంధ్రా పైనే ఉంది. పలు రంగాల్లో ఆంద్రప్రదేశ్ ఇతర రాష్ట్రాలకు ఆదర్శంగా తమ ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలను చంద్రబాబు వివరించారు. పలు వినూత్న కార్యక్రమాలను ఆర్థిక సంస్కరణలను చేపడుతున్న ఆంద్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ప్రోత్సహించి అత్యధిక సహాయం అందించాల్సిన అవసరం ఉంది. రాష్ట్ర ప్రభుత్వ పర్యవేక్షణ యంత్రాంగం చాలా సమర్ధంగా ఉంది. 8వ పంచవర్ష ప్రణాళికను

ప్రభుత్వం చక్కగా వినియోగించుకుంది. నీటి వినియోగదారుల సంఘాలు వనసంరక్షణ సమితులు ఇతర స్వయం సహాయక గ్రూపుల ద్వారా లబ్ధిదారులే ప్రభుత్వకార్యక్రమాల్లో పాలు పంచుకుంటున్న విషయాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించారు. విజన్‌లో పేర్కొన్న భారీ లక్ష్యాలను సాధించాలంటే ప్రాథమిక విద్య, ఆరోగ్యరంగాల్లో పెద్ద ఎత్తున పెట్టుబడులు అవసరమని ఇటీవల కాలంలో కేంద్రం నుంచి అత్యదిక సహాయం పొందుతున్న రాష్ట్రం ఆంధ్రప్రదేశ్‌లో ప్రణాళికేత వ్యయానికి సంబందించి రాష్ట్ర ప్రభుత్వ పని తీరు, భాగుంది రాష్ట్రంలో మానవ వనరుల అబివృద్ధికి గాను ప్రాథమిక విద్య ఆరోగ్య రంగాల్లో పెట్టుబడుల కోసం పెద్ద ఎత్తున నిధులు సమీకరణ చేపట్టినట్లు సహజవనరులను పూర్తిగా వినియోగించుకునే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన కార్యక్రమాల గురించి చెప్పారు. రాష్ట్రఆర్థిక పరిస్థితిని చక్కదిద్దడానికి చర్యలు తీసుకుంటున్నాము. విద్యుత్ రంగ సంస్కరణలకోసం సంధి యుగంలో ఒక ప్యాకేజ్‌ని రూపొందించాలి. విదేశీ సహాయంతో చేపట్టిన ప్రాజెక్టులకు సంబందించి కొన్ని టెండర్లను కూడా రద్దు చేశామని తలసరి ఆదాయం విషయంలో ఆంధ్రప్రదేశ్ జాతీయ సగటును అధిగమించింది జనాభాకు సంబందించి వచ్చే 2,3 సంవత్సరాల్లో 2.1 రిప్లేస్‌మెంటును కూడా సాధించనుంది అక్షరాస్యత శాతం ప్రగతి సాధించింది. 100శాతం అక్షరాస్యత సాధించాలనేది తమ లక్ష్యం గిరిజనుల అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం మరింతచురుకైన చర్యలు చేపట్టాలని ముఖ్యమంత్రి అన్నారు.



## ముఖ్యసేవకునితో క్లింటన్

క్లింటన్ అతి సామాన్యకుటుంబంలో పుట్టి కష్టపడిపైకి వచ్చారు. అమెరికా అధ్యక్షునిగా ఇంటర్‌నెట్‌ను, డిజిటల్ ఏకానమీని బ్రహ్మాండంగా వినియోగించుకుని గత ఎనిమిదేళ్ళలో అక్కడ సరిక్రొత్త ఆర్థిక వ్యవస్థని సృష్టించారు. క్లింటన్ తెచ్చిన భారీ సంస్కరణలు అక్కడ ప్రగతిని, సంపదను అభివృద్ధి చేశాయి. మనంకూడా అదే బాటలో నడుస్తున్నాం. క్లింటన్ రాక సహజంగా సంతోషం కల్గించింది. బిల్‌క్లింటన్ అమెరికాలో సరిక్రొత్త ఆర్థిక వ్యవస్థని సృష్టించి ఎంతో అభివృద్ధి సాధించి క్రొత్త ఉద్యోగాలను భారీగా పెంచగలిగారు. మిగిలిన దేశాలతో సమాచారం సంబందాలు బాగా పెంచే ప్రపంచ స్థాయి భారీ ఫైబర్ ఆప్టిక్ ప్రాజెక్ట్ "ఆక్సిజన్" ప్రాంతీయ కేంద్రం మన విశాఖలో ఏర్పాటౌతుంది. రాష్ట్రంలోని అన్ని మండలాల కంప్యూటరీకరణ పూర్తవుతుంది. ఇరవైమూడు రకాల సేవలను రాష్ట్రవ్యాప్తంగా కంప్యూటర్ల ద్వారా అందించగల సాంకేతిక రంగం మన రాష్ట్రం సాదిస్తోంది అన్నారు చంద్రబాబు నాయుడుగారు.

గతంలో క్లింటన్ చైనా వెళ్ళినప్పుడు అక్కడ రెడ్‌కార్పెట్ స్వాగతం ఇచ్చారు. ఏడు రోజుల పర్యటనకు 80కోట్లు చైనా ప్రభుత్వం ఖర్చు పెట్టింది. చైనా క్లింటన్‌కు ఘన స్వాగతం పల్కితే ఇక్కడ వామపక్షాలు ఎందుకు నిరసన వ్యక్తం చేస్తున్నాయో తెలియదు.
స్వశక్తితో పైకి రావాలి. ఆత్మగౌరవంతో మెలగాలి పేద అరుపులు అరచిపైకి రాలేం, సాంకేతిక పరిజ్ఞానం అబివృద్ధి చేసుకోవాలి.
మన రాష్ట్రంలో గ్రామ స్థాయి వరకూ ఫైబర్ ఆప్టిక్ లైన్లు వేయటానికి రిలయన్స్, జీటీవీ, టాటా , తదితర్ళులకు అనుమతిచ్చాం - వీటికి ప్రపంచ స్థాయి సమాచార సంబంధాలు తోడైతే ఏదేశం వెళ్ళనక్కర్లేకుండా శ్రీకాకుళంలోనో, ఆదిలాబాద్‌లోనో కుర్చొని పనులు పూర్తి చేసుకోవచ్చు

- ఇ.కామర్స్ లావాదేవీలు, టెలిమెడిసిన్ గ్రామాలవరకు వెళ్ళిపోతాయి
- వీటి ద్వారా ప్రజలు నేరుగా లబ్ధిపొందే అవకాశం వుంది.

ఆంధ్ర ప్రదేశ్‌కు అమేరికా అధ్యక్షుడు రావటం ఇదే ప్రధమం - దక్షిణ భారతదేశానికి రావడం కూడా ఇదే ఫస్ట్. 24-03-2000 సం॥ బిల్‌క్లింటన్ అమేరికా అద్యక్షుడి హోదాలో "ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిని అభినందించటం స్వర్ణాంధ్రప్రదేశ్‌కు శుభసూచకం - ఆంధ్రులు గర్వించ దగ్గ విషయం".

శ్రీ చంద్రబాబు నాయుడు విజ్ఞాన ప్రతిభ చూస్తుంటే ఈ రాష్ట్రాని విజ్ఞాన శక్తిగా మార్చగలరనిపిస్తోంది. ఈ సి.యం. గారి గురించి అమెరికాలో విన్నాం - వీరిని కల్సుకోవాలనుకున్నాం - ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజీ, టేలీకాన్ఫరేన్స్‌లు, విజ్ఞానరంగాలలో హైద్రాబాద్‌కు అంతర్జాతీయగుర్తింపు తీసుకు వచ్చిన చంద్రబాబు నాయుడు గార్ని అభినందిస్తున్నాను - అని మన ముఖ్యమంత్రి గార్ని గురించి ప్రశంసించిన అమేరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్ అమేరికా వెళ్ళాక కూడా వారి ప్రభుత్వఅధికారులతో చంద్రబాబు నాయుడుగారి క్రమశిక్షణ, సాంకేతిక నైపుణ్యత, సమర్ధవంతమైన పరిపాలనాదక్షత, గురించి చెప్పారంటే తెలుగు జాతి గర్వించాలి - స్వర్ణోత్సవాలు జరుపుకున్న తెలుగుప్రజకు తెలియదా - మనసున్న ప్రతి మనిషికీ తెలుసు - మన ఏబైఏళ్ళ ముఖ్యమంత్రులలో నెంబర్ వన్ - ముఖ్యమంత్రి నారాచంద్రబాబు గారు పనిచేసే ముఖ్యమంత్రిని ఆశీర్వదించండి. విజన్ 2020 ఆశయాలు నెరవేర్చుకుందాం-

స్వర్ణాంధ్రకోసం స్వర్ణజయంతి జరుపుకునే మమతల నారాచంద్రుని హృదయపూర్వకంగా అభినందించి ఆశీర్వదించండి.

**జై చంద్రబాబు - జైజన్మభూమి**





సంస్థాగత ఎన్నికల సంచాలకుల శిక్షణ
సదుస్సులో C.M.



ప్రధానమంత్రి వాజ్‌పేయితో ముఖ్యమంత్రి



వరద సహాయం గురించి ప్రస్తావిస్తున్న
P.M. తో C.M.



జన్మభూమి కార్యక్రమంలో మహిళా
సమస్యలు తెలుసుకొంటున్న C.M.



ఇటలీ పెట్టుబడుదారుల బృందంతో C.M.
ఇటలీ రాయబారి గెలునోజూక్లీన్



హైదరాబాద్ గోషామహల్ స్టేడియంలో వన సంరక్షణ సమితి అధ్యక్షుల సమావేశంలో C.M.




**న్యూయార్క్‌లో నాస్కాయే ఏర్పాటు చేసిన సమావేశంలో C.M.**



**లోక్‌సభ స్పీకర్ బాలయోగికి స్వీటు తినిపిస్తున్న C.M.**



ప్రపంచ బ్యాంక్ M.D. కె. యోకోష్ వాసర్‌తో C.M.



బోస్టన్‌లోని యెసాచా పెబ్సు జనరల్ హాస్పిటల్‌లో డాక్టర్స్ నుద్దేశించి ప్రసంగిస్తున్న C.M.



హైదరాబాద్ పబ్లిక్ గార్డెన్స్‌లో ఫిలిం ఫేర్‌ను
ప్రారంభిస్తున్న C.M.



ప్రపంచ బ్యాంకు అధ్యక్షులు ఉల్ఫెన్‌సన్‌తో C.M.



C.S.I. గౌరవ పెలోషిప్‌ను ముఖ్యమంత్రికి
అందజేస్తున్న C.S.I. అధ్యక్షుడు Dr. R. శ్రీనివాస్



జన్మభూమి సందర్భంగా రంగారెడ్డి జిల్లా
పెండ్లిమడుగు వద్ద అభివృద్ధి కార్యక్రమాలు
సమీక్షిస్తున్న ముఖ్యమంత్రి



ప్రణాళిక సంఘ ఉపాధ్యక్షుడు జస్వంత్ సింగ్‌తో ముఖ్యమంత్రి
రైల్వే మంత్రి నితీష్ కుమార్‌తో ముఖ్యమంత్రి
వాణిజ్యశాఖ మంత్రి హెగ్డేతో ముఖ్యమంత్రి
కేంద్ర క్యాబినెట్ కార్యదర్శి ప్రభాత్‌కుమార్ తో ముఖ్యమంత్రి



రైతుబజారు ప్రారంభించిన ముఖ్యమంత్రి



బోస్టన్‌లో భారతీయ విద్యార్థులతో ముఖ్యమంత్రి



హైదరాబాద్ లలిత కళాతోరణంలో ఇండియన్ రెట్రాస్పెక్టివ్ (తెలుగు విభాగం)ను ప్రారంభిస్తున్న అక్కినేనితో ముఖ్యమంత్రి



హైటెక్ సిటీ భవనం



వాషింగ్‌టన్‌లో భారతీయ రాయభారి నరేష్ చంద్రతో ముఖ్యమంత్రి



అఖిలపక్ష సమావేశంలో ముఖ్యమంత్రి



విజయనగరం జిల్లా అద్దూరి వానిపాలెంలో
వృద్ధురాలి వినతికి స్పందిస్తున్న ముఖ్యమంత్రి



అసెంబ్లీ ఆవరణలో గాంధీ విగ్రహ ఆవిష్కరణలో
ముఖ్యమంత్రి



క్లీన్ అండ్ గ్రీన్ సందర్భంగా కేస్లాపూర్
గిరిజనులతో ముఖ్యమంత్రి



పోలీస్ సంస్కరణల కమిటీతో ముఖ్యమంత్రి



పోలీస్ పేరేడ్ గ్రౌండ్‌లో గౌరవవందనం
స్వీకరిస్తున్న ముఖ్యమంత్రి



ఎన్.జి రంగా విగ్రహ ఆవిష్కరణలో ప్రధాని,
ఉపరాష్ట్రపతితో ముఖ్యమంత్రి



అఖిలపక్ష సమావేశంలో ముఖ్యమంత్రి



కేంద్రపట్టాణభివృద్ధిశాఖమంత్రి రాంజెర్మలాన్‌కి
మోమెంటో బహుకరిస్తున్న ముఖ్యమంత్రి



అమెరికాలో సత్యం కంప్యూటర్ నెలకొల్పిన
సాఫ్ట్‌వేర్ కేంద్రం పనితీరును ముఖ్యమంత్రి కి
వివరిస్తున్న ఛైర్మన్ రామలింగరాజు




హైటెక్ సిటీ ప్రారంభత్సోవ సందర్భంగా ప్రధాని వాజ్‌పేయి మరియు గవర్నర్ రంగరాజన్‌తో ముఖ్యమంత్రి



జన్మభూమి కార్యక్రమంలో భాగంగా V.A.O లు నిర్మించిన గ్రామ చావడికి (ఇంకోల్లు ప్రకాశంజిల్లా) సున్నం వేస్తున్న ముఖ్యమంత్రి



బిల్‌గేట్స్‌కు మోమెంటో బహుకరిస్తున్న
ముఖ్యమంత్రి



న్యూయార్క్‌లో న్యూజెర్సీ గవర్నర్ క్రిస్టీ విట్మన్‌తో
ముఖ్యమంత్రి చంద్రబాబు



తిరుపతిలో సాంఘిక సంక్షేమ హాస్టల్‌ను
సందర్శిస్తున్న ముఖ్యమంత్రి



జపాన్ వాణిజ్య ప్రతినిధి బృందంతో ముఖ్యమంత్రి



అమెరికాలో సీటెల్‌లో గ్లోబల్ ఇన్‌ఫోవేర్.12 కే
కంపెనీ భాగస్వాములతో ముఖ్యమంత్రి



కేంద్ర హోంమంత్రి ఎల్.కె. అద్వానీతో
ముఖ్యమంత్రి



విజన్ 2020 డాక్యుమెంట్ ముసాయిదా రిలీజ్
చేస్తున్న గవర్నర్ రంగరాజన్‌తో ముఖ్యమంత్రి



సంస్థాగత ఎన్నిక సంచాలకుల శిక్షణ సదస్సులో
ముఖ్యమంత్రి